

స్థాపితము: 20-2-1965 రిజిస్టర్డ్ నెం. 69/65,4-11-1965

# అఖిల ఆంధ్ర సాధు పరిషత్

## అష్టపఞ్చాశత్తమ (58 వ) మహాసభలు

అయమాత్మా బ్రహ్మ

తత్త్వమసి




అహం బ్రహ్మాస్మి

ప్రజ్ఞానం బ్రహ్మ

సభా స్థలము

## శ్రీ క్షేత్రము పంఢరీపురము – మహారాష్ట్రము

2024 జనవరి 29,30,31 తేదీలు



స్థాపితము: 20-02-1965

రిజిష్టర్డ్ నెం. 69/65,4-11-1965

# అఖిల ఆంధ్ర సాధు పరిషత్

## ఏబది ఎనిమిదవ భాగము

అయమాత్మా బ్రహ్మ

తత్త్వమసి




అహం బ్రహ్మాస్మి

ప్రజ్ఞానం బ్రహ్మ

త్యాగేనైకేన అమృతత్త్వమానశుః

## అష్టపఞ్చాశత్తమ (58 వ) వార్షిక మహాసభలు

**సభా స్థలము**

శ్రీ క్షేత్రము పంఢరీపురము– మహారాష్ట్రము

**అఖిల ఆంధ్ర సాధు పరిషత్**

**ఏబది ఎనిమిదవ భాగము**



మూల్యము: /- రూపాయలు

పోస్టేజీ అదనము

**పూజ్య శ్రీ పరావిద్యానన్దగిరి మాతాజీ వారు**

అఖిలాంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు

ఫోన్ నెం : 8247504867

వివరములకు :—**పూజ్యశ్రీ జగదీశ్వరానన్దగిరి స్వాముల వారు**

అఖిలాంధ్ర సాధు పరిషత్ - ప్రధాన కార్యదర్శి

ఫోన్ : 9949346659

ప్రాప్తి స్థానము :—

**అఖిల ఆంధ్ర సాధు పరిషత్ భవనము**

1-12-3, వెల్లంకి వారి వీధి, నాజరుపేట, తెనాలి,

గుంటూరు జిల్లా, పిన్: 522 201.

పరిషత్ ఫోన్ : 6304223939

ఆన్ లైన్ సౌకర్యము గలదు



## విషయ సూచిక

# అఖిల ఆంధ్ర సాధు పరిషత్ యొక్క వార్షిక మహాసభల వివరము

| వ.సం. | జిల్లాలవారిగా | జరిగిన ప్రదేశము | సంవత్సరము | నెల, తేదీలు |
|---|---|---|---|---|
| 1 | పశ్చిమగోదావరి | భీమవరం | 1966 | జనవరి 1,2,3 |
| 2 | తీర్పుగోదావరి | అంబాజీపేట | 1967 | జనవరి 21,22,23 |
| 3 | గుంటూరు | గుంటూరు | 1968 | జనవరి 5,6,7 |
| 4 | కడప | ప్రొద్దుటూరు | 1969 | జనవరి 5,6,7 |
| 5 | గుంటూరు | తెనాలి | 1970 | జనవరి 9,10,11 |
| 6 | తూర్పుగోదావరి | రాజమండ్రి | 1971 | జనవరి 1,2,3 |
| 7 | పశ్చిమగోదావరి | పాలకొల్లు | 1972 | జనవరి 1,2,3 |
| 8 | నెల్లూరు | సోమశిల | 1973 | జూలై 4,5,6 |
| 9 | ఆదిలాబాదు | సోనాల | 1974 | జనవరి 8,9,10 |
| 10 | చిత్తూరు | చిత్తూరు | 1975 | జనవరి 10,11,12 |
| 11 | మెదక్ | సిద్ధిపేట | 1976 | జనవరి 2,3,4 |
| 12 | తూర్పుగోదావరి | పెద్దాపురం | 1977 | జనవరి 3,4,5 |
| 13 | కర్నూలు | ఆదోని | 1978 | జనవరి 7,8,9 |
| 14 | హైదరాబాద్ | హైదరాబాద్ | 1979 | మార్చి 10,11,12 |
| 15 | తూర్పుగోదావరి | కాకినాడ | 1980 | జనవరి 25,26,27 |
| 16 | నల్గొండ | కోదాడ | 1981 | జనవరి 9,10,11 |
| 17 | విశాఖపట్నం | అనకాపల్లి | 1982 | జనవరి 18,19,20 |
| 18 | కరీంనగర్ | సిరిసిల్ల | 1983 | జనవరి 9,10,11 |
| 19 | గుంటూరు | గుంటూరు-శ్రీరామనామ క్షేత్రం | 1984 | జనవరి 27,28,29 |
| 20 | మహబూబునగర్ | కడ్తాల | 1985 | ఫిబ్రవరి 8,9,10 |
| 21 | చిత్తూరు | చిత్తూరు | 1986 | జనవరి 3,4,5 |
| 22 | అనంతపురం | పుట్టపర్తి | 1987 | జనవరి 2,3,4 |
| 23 | నిజామాబాద్ | నిజామాబాద్ | 1988 | జనవరి 1,2,3 |
| 24 | నెల్లూరు | నెల్లూరు | 1989 | జనవరి 26,27,28 |
| 25 | నిజామాబాద్ | కామారెడ్డి | 1990 | జనవరి 5,6,7 |
| 26 | కరీంనగర్ | కరీంనగర్ | 1991 | జనవరి 5,6,7 |
| 27 | కరీంనగర్ | కేశవపట్నం | 1992 | జనవరి 7,8,9 |
| 28 | గుంటూరు | ఉండవల్లి | 1993 | సెప్టెంబర్ 21,22,23 |
| 29 | చిత్తూరు | మదనపల్లి | 1994 | మే 6,7,8 |
| 30 | ముంబయి | ముంబయి | 1995 | జనవరి 13,14,15 |
| 31 | కర్నూలు | శ్రీశైలం | 1996 | మార్చి 14,15,16, |

| | | | | |
|---|---|---|---|---|
| 32 | మెదక్ | సదాశివపేట | 1997 | జనవరి 9,10,11 |
| 33 | గుంటూరు | ఇంటూరు | 1998 | ఏప్రిల్ 24,25,26 |
| 34 | తూర్పుగోదావరి | అమలాపురం | 1999 | జనవరి 9,10,11 |
| 35 | కడప | ప్రొద్దుటూరు | 2000 | మార్చి 31,ఏప్రిల్ 1,2 |
| 36 | ప్రకాశం | కందుకూరు | 2001 | మే 5,6,7 |
| 37 | నెల్లూరు | నెల్లూరు | 2002 | జూన్ 28,29,30 |
| 38 | గుంటూరు | పిడుగురాళ్ళ | 2003 | జూన్ 21,22,23 |
| 39 | కడప | ప్రొద్దుటూరు | 2004 | ఫిబ్రవరి 6,7,8 |
| 40 | కృష్ణా | ఉయ్యూరు | 2005 | జనవరి 9,10,11 |
| 41 | తూర్పుగోదావరి | మండపేట | 2006 | జనవరి 17,18,19 |
| 42 | విశాఖపట్టణం | సింహాచలం | 2007 | మార్చి 28,29,30 |
| 43 | పశ్చిమగోదావరి | పాలకొల్లు | 2008 | జనవరి 18,19,20 |
| 44 | కరీంనగర్ | గాగిల్లాపురం | 2009 | ఫిబ్రవరి 26,27,28 |
| 45 | తూర్పుగోదావరి | అంతర్వేది | 2010 | జనవరి 9,10,11 |
| 46 | గుంటూరు | గుంటూరు | 2011 | జనవరి 7,8,9 |
| 47 | కడప | ప్రొద్దుటూరు | 2012 | జనవరి 7,8,9 |
| 48 | ఒంగోలు | ఒంగోలు | 2013 | ఫిబ్రవరి 1,2,3 |
| 49 | కడప | కడప | 2014 | జనవరి 24,25,26 |
| 50 | హైదరాబాద్ | భాగ్యనగరము | 2015 | జనవరి 9,10,11 |
| 51 | గుంటూరు | తెనాలి | 2016 | జనవరి 8,9,10 |
| 52 | చిత్తూరు | అంబికాపురం | 2017 | జనవరి 17,18,19 |
| 53 | విశాఖపట్నం | విశాఖపట్నం | 2018 | ఫిబ్రవరి 16,17,18 |
| 54 | హైదరాబాద్ | కూకట్ పల్లి | 2019 | ఏప్రిల్ 27,28,29 |
| 55 | కర్నాటక | గానుగాపూర్ | 2020 | ఫిబ్రవరి 11,12,13 |
| 56 | కృష్ణాజిల్లా | పెదపులిపాక | 2021 | ఏప్రిల్ 25,26,27 |
| 57 | నిజామాబాద్ | నందిపేట్ | 2023 | జనవరి 28,29,30,31,ఫిబ్ర 1 |
| 58 | మహారాష్ట్రము | శ్రీ పంఢరీ క్షేత్రము | 2024 | జనవరి 29,30.31 |

అఖిలాంధ్ర సాధుపరిషత్ మహాసభలను ఆహ్వానము చేసి జరుప సంకల్పించువారు రాబోవు సభలలో మీ మీ అభ్యర్ధన పత్రములను సమర్పించవలసియుండును. మీ అభ్యర్థనను సర్వసభ్య సమావేశములలో చర్చించి నిర్ణయింపబడును.



**అఖిల ఆంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు**

**పూజ్య శ్రీశ్రీశ్రీ మాతా పరావిద్యానందగిరి స్వామిని వారు**



పూజ్యశ్రీ గజ్జల నర్సయ్య మహారాజ్ - సోలాపూర్ గారిచే జ్యోతి ప్రజ్వలనము



శ్రీ మార్కండేయ జనజాగృతి సంఘము - సోలాపూర్

Computerized by :

Swami Brahmavidyananda giri &

Brahmachari Ajay Chaitanya

Shri Maharshi Malayalaswami Ashram,

Plot no. 48, Kalavathinagar, M.I.D.C. Solapur.

Maharashtra - 413 006.

Cell. 78430 36503; 70175 50722



## ప్రణవ పతాక గేయము

ఓంకార పూత వైరాగ్య భరిత వేదపతాకా జయహో !

అఖిలాంద్ర సాధు సజ్జన సంస్థిత అమల పతాకా జయహో ! ॥ ఓంకార॥

1. అకార ఉకార మకార మిళిత ఆద్యక్షరకృత జయహో !

సకల సిద్ధాంత జ్ఞానసార సంజాత శబ్ద సంస్తుత జయహో ! ॥ ఓంకార॥

2. కమనీయాంబర కాషాయవర్ణ కలితకేతనా జయహో !

విమల చిదంబర విస్తృతత్యాగ విలాస వైజయన్తి జయహో ! ॥ఓంకార॥

3. సచ్చిదానంద సాధు జనావళి చిన్మయ చిహ్న జయహో !

శాస్త్ర ప్రోక్త మతతత్త్వ సమన్వయ సత్యసంకేత జయహో !

4. ప్రణవార్ధబోధ ప్రజ్ఞాన బ్రహ్మ పరతత్త్వ పూర్ణ జయహో !॥ ఓంకార॥

ప్రసన్న భారత ప్రశాంతి ప్రజ్వల పవిత్ర ధారణ జయహో ! ॥ఓంకార॥

జయహో! జయహో ! ప్రణవ పతాకా !

జయహో జయహో విజయపతాకా !!

జయ రఘు హృదయ ధ్వజ జయహో !!

జయ ! సాధు సభాధ్వజ ! జయహో !!





అఖిల ఆంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు,
శ్రీ మాతా పరావిద్యానన్దగిరి స్వామినివారు,
శ్రీ రాజరాజేశ్వరి ఆశ్రమం, బొమ్మక్కపల్లి,
అనంతపురం-జిల్లా.Pin: 515867,
Cell: 8247504867

## ప్రణవ పతాకావిష్కరణము

★ ★ ★

**హృదయకమల మధ్యే దీపవద్వేదసారం,**
**ప్రణవమయమతర్క్యం యోగిహృద్ధ్యానగమ్యం ।**
**అజహరి శివయోగం సర్వభూతస్థమేకం,**
**సకృదపి మనసా మాం ధ్యాయతే యస్స ముక్తః ॥**

పరమ ఋషులకు, మహర్షులకు, సద్గురుమూర్తులకు ప్రప్రథమంగా కృతజ్ఞతాభివంద నములు తెలియజేసికొంటూ, సాధుపుంగవుల పాదపద్మములకు భక్తిపూర్వక ఓం నమో నారా యణలు తెలుపుకొంటూ, క్షేత్రాధిష్ఠానమైన శ్రీ రుక్మిణీసమేత విఠలనాథునకు ప్రణామ ములు ఆచరిస్తూ భక్తులందరకూ నారాయణ స్మరణలు తెలుపుతూ —

ఈ అఖిలాంధ్ర సాధు పరిషత్ 58 వ వార్షిక మహాసభలు ఈ పుణ్యక్షేత్రమగు శ్రీక్షేత్రం పంఢరీపురములో జరుపుకొనుట మనందరి సుకృత విశేషమని చెప్పక తప్పదు. ఈ కార్యక్రమ ము దిగ్విజయంగా, శుభప్రదంగా, మంగళదాయకంగా జరుగునట్లు ఆశీర్వదించవలసినదిగా ప్రార్థించుచూ ప్రణవ పతాకమును ఆవిష్కరించుకొన్నాము.

ప్రణవము **"అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్"**

ఎనిమిది అంగములు, నాలుగు పాదములు (కాళ్ళు కావు) మూడు స్థానములు, అయిదు దైవతముల స్వరూపమైనది.

అష్టాంగములు → జీవుని అంగములు 4
(1)విశ్వుడు (2)తైజసుడు (3)ప్రాజ్ఞుడు (4) ప్రత్యగాత్మ
అష్టాంగములు → ఈశ్వరుని అంగములు 4
(1)విరాట్ (2)హిరణ్యగర్భ (3)అవ్యాకృత (4)పరమాత్మ

మొత్తం 8 అంగములు

చతుష్పాదం—(1)అకార (2)ఉకార(3)మకార(4)అర్ధమాత్ర అను నాలుగు పాదములు

త్రిస్థానం—(1)జాగ్రత (2)స్వప్న (3)సుషుప్తి అను మూడు స్థానములు

పంచదైవతం—(1)బ్రహ్మ (2)విష్ణు (3)రుద్ర (4)సదాశివ (5)మహేశ్వరులను అయిదు దేవతా స్వరూపము కలది ఓంకారము —

అనగా ఈ విశ్వమంతా వ్యాపించివున్న పరబ్రహ్మము యొక్క వాచకము (పేరు) ప్రణవము. **"తస్య వాచకః ప్రణవః"** (యో.సూ.1-27). అదే ఓంకారము.

**"ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న స బ్రాహ్మణః"**

**"బ్రహ్మజ్ఞానీ తు బ్రాహ్మణః"**

సర్వవేదసారమైన హృద్గతమైన ఈ ప్రణవముయొక్క యదార్థ స్వరూపమును తెలిసిన వాడే బ్రాహ్మణుడు, అనగా బ్రహ్మజ్ఞాని. నామరూప రహితము, గుణశూన్యమైన ఈ ప్రణవ స్వరూపము తెలియనివాడు బ్రహ్మజ్ఞానియే కాడు.

ఈ మహాసభలయొక్క ముఖ్య ఉద్దేశము బ్రహ్మజ్ఞానమును మనకందించుటయేనని, చెప్పకనే చెప్పుటకు పరమమంగళ స్వరూపమైన ప్రణవ పతాకమును ఆవిష్కరించుకొన్నాము. అవిచ్ఛిన్నమైన, సంశయాది ప్రతిబంధరహితమైన ఆత్మస్వరూపము యొక్క స్ఫూర్తి సాధకులందరకు కలుగవలయునని ప్రణవపరబ్రహ్మము, ఈ శ్రీక్షేత్ర పండరినాథుడు,గురుదైవములు అనుగ్రహించి ఆశీర్వదించవలయునని మనసారా ఆకాంక్షించుచున్నాను.

జై ప్రణవ పతాకకు జై

దైవమతము ప్రతిష్ఠితమగును గాక!

జ్ఞానమతము వ్యాపకమగును గాక!

జై సద్గురు మహారాజ్ కు జై

॥ ఓం తత్సత్ ఓం ॥

**ప్రమాదినో బహిశ్చిత్తాః పిశునాః కలహోత్సుకాః ।**

**సంన్యాసినోఽపి దృశ్యన్తే దేవసన్దూషితాశయాః ॥**

సంన్యాసులలో కొందరు చక్కగా గురుశుశ్రూషాది తపశ్చర్యలు చేయనివారగుటచే, గురు, దైవ శాస్త్రములలో చక్కని అనుష్ఠానము లేనివారగుటచే, దేవతల వలన దూషితమైన చిత్తము గలవారై, బాహ్యవృత్తి కలవారై, పైశునగుణము అనగా చాడీలు చెప్పు స్వభావము గలవారై, కలహప్రియులై, ప్రమాదము నొందినవారై కనబడుచున్నారు.

(శ్రీ సురేశ్వరాచార్యులు)



అఖిల ఆంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు,
శ్రీ మాతా పరావిద్యానన్దగిరి స్వామినివారు,
శ్రీ రాజరాజేశ్వరి ఆశ్రమం, బొమ్మక్కపల్లి,
అనంతపురం-జిల్లా.Pin: 515867,
Cell: 8247504867

## అధ్యక్షోపన్యాసము

మన అఖిలాంధ్ర సాధు పరిషత్ 58 వ వార్షిక మహాసభలు శ్రీక్షేత్రమైన పంఢరీపురంలో సోలాపూర్ వాస్తవ్యులైన మల్లయ్య నారాయణ భోగ మహరాజ్ ట్రస్టు మరియు మార్కండేయ జన జాగృతి సంఘ ట్రస్టు అధ్యక్షులైన శ్రీయుతులు చి ॥ మార్కండేయ సారథ్యంలో సోలాపూర్ పట్టణంలోని ఇతర సంఘ ట్రస్టుల మరియు భక్తుల సహాయసహకారములతో సంకల్పింపబడి దివ్యంగా కొనసాగుచున్నవి.

దీనికంతటికి మూల కారణ పురుషులైన సాధుమహాత్ములకు వారికి మార్గనిర్దేశకంగా నిలచిన పూర్వ మహర్షులకు, మహాత్ములకు సభయందు ఆసీనులైన సాధుపుంగవుల మరియు మాతాజీల దివ్యారుణ చరణములకు భక్తిపూర్వక ఓంనమో నారాయణ స్మరణలు చెల్లించుకొంటూ, జ్ఞానపిపాసతో సభలకు విచ్చేసిన, నరనారీరూప నారాయణునకు, క్షేత్రాధిష్ఠాన దైవమైన రుక్మిణీసమేత శ్రీపాండురంగ విఠల నాథునకు పంచాంగయుక్త ప్రణామములు ఆచరిస్తున్నాను.

వ్యక్తిగత జీవితంలోగాని సామాజికంగాగాని ప్రశ్న వుదయిస్తేనే సమాధానం దొరుకుతుంది. ప్రశ్న చాలామంచిది. ప్రశ్నించడం ఉత్తమోత్తమము. ప్రశ్న మదిలోమెదిలిందంటే జ్ఞానం వైపు మొదటి అడుగు పడినట్లు గుర్తు. తనలో కలిగిన సందేహం యొక్క ప్రతిరూపమే ప్రశ్న. సమాధానం కొరకు చేసే ప్రయత్నమే సాధన.

**"తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః"** (యో.సూ.1-13) అని పతంజలి మహర్షి యోగసూత్రములలో తెలియజేసినది ఇదియే. మన ప్రయత్నంలో సఫలీకృతులమై సమాధానం దొరికిందంటే జ్ఞానం కలిగినట్లే. జ్ఞానమును ప్రకాశంతో పోల్చవచ్చు. వెలుగులో జీవనగమనం సుఖంగా ఆనందంగా కొనసాగుతుందని అందరకూ (ఎల్లరకూ) తెలిసిన విషయమే.

ఇంగ్లీషు వ్యాకరణంలో కూడా ఒక వాక్యంలో కర్త,కర్మ,క్రియ తెలియాలంటే who? whoom ? what ? అని ప్రశ్నించుకోవాలంటారు. అదే విధంగా ఎందుకు? ఏమిటి అనే ప్రశ్నలు వుదయిస్తేనే ప్రపంచము యొక్క యథార్థమైన స్థితి మనకు తెలియబడుతుంది.

ప్రశ్నించడం తప్పుకాదు. ఎదుటివారి జ్ఞానాన్ని తెలిసికొనవలెనని ప్రశ్నించడం అడ్డదిడ్డం

గా వాదించడం **"అబద్ధం వా సబద్ధం వా కుంతీపుత్రో వినాయకః"** అబద్ధం కాని సబద్ధం కాని కుంతీపుత్రుడు వినాయకుడు-అనడం తప్పు. వేదములోని భాగమైన ఉపనిషత్తులు, స్మృతులైన శ్రీమద్భగవద్గీతాది గ్రంథములు అన్నీ గురు శిష్య సంవాదరూపంలోనే వెల్లివిరిసినాయి.

**"అడిగేవాడికి చెప్పేవాడు లోకువ"** అనే సామెత లోకంలో వున్నది.

**నాపృష్టః కస్యచిత్ బ్రూయాత్ నచాన్యాయేన పృచ్ఛతః ।**

**జానన్నపి చ మేధావీ జడవల్లోక ఆచరేత్ ॥** (సంన్యాసోపనిషత్ ౭-౧౦౭)

అడగనిదే చెప్పకూడదని శాస్త్ర వాక్యమూ వున్నది. ఆకలయినవాడికి అన్నం పెడితే ఎంత ప్రయోజనమో, అడిగినవాడికే సమాధానం చెబితే అంత లాభం. అడగనివానికి చెబితే అంత ప్రమాదం కూడా.

భారతంలో ఒక కథ వుంటుంది.

ఒకసారి అడవిలోని కోతులన్ని పెద్దవర్షానికి బాగా తడిసిపోయినాయి. చలికి గజ గజ వణుకుతూ అక్కడక్కడా వున్న ఎండు పుల్లలను ఒక చోట కుప్ప చేసి దాని చుట్టూ కూర్చున్నాయి. అది మండాలంటే నిప్పు కావాలికదా! నిప్పుకొరకు అటు ఇటూ వెదుకుతుంటె వాటికి కొన్ని మిణుగురు పురుగులు వెలుగుతూ ఆరుతూ కనిపించాయి. వాటిని తెచ్చి పుల్లలలో పెట్టి పూదడం మొదలుపెట్టాయి. దీనినంతటిని దూరంగా చెట్టు మీద కూర్చొని గమనిస్తున్న ఒక చిన్న పిట్ట, కోతుల ప్రయత్నం విఫలమవుతుండటం గమనించి, వాటికి హితముచేసే ఉద్దేశముతో వెలుగుతూ ఆరుతూ వున్నది నిప్పు కాదని, పుల్లలలో దానిని పెట్టి ఎంతసేపు ఎంతగా వూదినా ప్రయోజనం లేదని, రెండు చెకుముకి రాళ్ళు తెచ్చి నిప్పు చేసికొనమని చెప్పింది.

ఒకసారి ఆ పిట్ట చెప్పినా కోతులు పట్టించుకోకుండా అవి చేసేపని చేస్తూనే వున్నాయి. ఆ పిట్ట వీటి వృథా ప్రయత్నాన్ని చూడలేక మళ్ళీమళ్ళీ చెప్పింది. తమ అజ్ఞానపు కార్యంలో నిమగ్నమైయున్న ఆ కోతులు ఆ పిట్టపై విసుగు చెంది కోపగించుకోవడంతో సరిపెట్టు కోకుండా, దానిని చంపేశాయి, ఇది అడగకుండా చెప్పిన హితోపదేశానికి కలిగిన ప్రయోజనము. ఇది ఇలా వుంటే —

వినయ విధేయతలతో అడిగినా అర్హతలేనివానికి చెబితే ఎలావుంటుందో,ఇంకొక ఉదాహరణ ద్వారా తెలిసికొందాము. ఆత్మపురాణము అను గ్రంథంలో తెలియజేయబడినది.

భుశుండుడు అను ఆత్మజ్ఞానియైన మహానుభావుడు ఏకాంతంగా అడవిలో ఆత్మానుసంధానపరుడై నిరంతరం సమాధినిష్ఠలో వుంటూ అపుడపుడు ఆత్మజ్ఞాన పిపాసతో తన్ను దరిచేరిన సాధకులకు ఉపదేశం చేస్తూ వుండేవాడు.

ఇలా కాలం గడుస్తూ వుండగా ఒకనాడు సాక్షాత్తు స్వర్గలోకాధిపతియైన దేవేంద్రుడు మహర్షిని సమీపించి విధివిధానంగా సాష్టాంగ దండప్రణామములు ఆచరించి- వినయవిధే యతలతో నిలుచున్నారు. అతనిని చూచిన ఆ మహర్షి, దేవేంద్రా ! నీవు ఇచటికి వచ్చి నన్ను ఆశ్రయించుటకు కారణమేమి? ఏమాత్రమూ సందేహించ వద్దు. నీవు వచ్చిన పని తప్పక నెర- వేర్చుతాను తెలియ జేయి అన్నారు.

అందులకు దేవేంద్రుడు సంతోషించి మహాత్మా! ఆత్మయొక్క యథార్థజ్ఞానమును నాకు తెలియజేయండి. నేను ఆ విషయమైయే మిమ్ములను ఆశ్రయించాను అన్నాడు. అదివిన్న మహ ర్షులవారు సందిగ్ధంలో పడ్డారు. ఆత్మజ్ఞానాభ్యాసికి మొట్ట మొదట వుండవలసిన అర్హత వైరాగ్యము. స్వర్గలోక సుఖభోగాలలో నిరంతరము తేలియాడే దేవేంద్రునికి అది శూన్యము.

**అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూక స**
**ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావళీ**
**బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధ ద్రవ్యముల్ క్రోడ స**
**ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్ ॥** (తెలుగు భాగవతము 7-168)

అని ప్రహ్లాదుడు తన తండ్రియైన హిరణ్యకశిపునితో అన్నాడు.

గ్రుడ్డివానికి సూర్యోదయమైననూ, గొప్ప చెవిటివానిముందు శంఖము వూదిననూ, మూగవాడు సద్గ్రంథములను వ్యాఖ్యానము చేసినట్లు, నపుంసకునికి స్త్రీపై కోరికలు కలిగిన నూ, కృతజ్ఞతలేని వానితో బంధుత్వము,బూడిదలో హోమంచేసిన పదార్థములు, లోభివాని దగ్గరవున్న సంపద, గాడిదకు మంచి సుగంధము ఏవిధముగా ప్రయోజనము లేనివో, అదేవిధంగా హరిభక్తి లేని వారి పుట్టుక, గిట్టుక అనే సంసారము వ్యర్థమని ప్రహ్లాదుని అభిప్రాయమైతే-అదే ప్రకారంగా వైరాగ్యము లేనివానికి ఆత్మజ్ఞాన బోధ వ్యర్థమే.

హరిభక్తి లేని వాని సంసారము కేవలము వ్యర్థమే కాని వైరాగ్యము లేనివానికి కలిగిన ఆత్మబోధ వికటించి పెడర్థములు కలుగుచేయు ప్రమాదము కూడా కలదు.

ఇవన్నీ ఆలోచించిన మహర్షి ఆత్మజ్ఞాన బోధ చేయుట నిరర్థకమని తెలిసినా నీవు వచ్చిన పనితప్పక నెరవేరునట్లు చేయుదునని ఇచ్చిన మాట జ్ఞప్తి చేసికొని దేవేంద్రునకు బోధ చేయుట ప్రారంభించారు. సందర్భవశాత్తు —

**“ఆహార నిద్రా భయ మైథునాని సామాన్యమేతత్పశుభిర్నరాణామ్”** (హితోపదేశము)

అన్న వాక్యాన్ని వివరిస్తూ నీవు శచీదేవితో అనుభవించు భోగము ఒక మగకుక్క ఆడ కుక్కతో అనుభవించు భోగముతో సమానమే అంటూ చెప్పుకొచ్చారు. ఆసందర్భంలో మౌనం

గానే వున్న దేవేంద్రుడు బోధ ముగిసిన తరువాత వెళ్ళబోయే సమయంలో మహానుభావా! నన్ను మీరు కుక్కతో పోల్చుతారా! ఇదా మీరు చెప్పే బోధ. ఇకపై మీరెవరికైనా బోధ చేశారంటే మీ తల వెయ్యి ప్రక్కలవుతుందని గురుదక్షిణగా శాపమిచ్చి వెళ్ళిపోయాడు.

అటుతరువాత ఆ మహర్షి మౌనమే మహాభాగ్యమని భావించి అర్థించినవారికి కూడా జ్ఞానబోధ చేయకుండా వున్నారు. కాని ఒకసారి, అశ్వినీదేవతలు వచ్చి ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించమని అర్థించగా, కలుగు ప్రమాదాన్ని వివరించారు మహర్షులు. వెంటనే అశ్వినీ దేవతలు తమ వైద్యపరిజ్ఞానంతో మహర్షి తల తీసి ప్రక్కన పెట్టి, మేకతల అతికించి బోధ ప్రారంభించమన్నారు. ఎప్పుడైతే మహర్షి బోధ ప్రారంభించారో మహర్షి మెడమీద వున్న మేక తల వెయ్యి ప్రక్కలైనది. వెంటనే, అశ్వినీదేవతలు ప్రక్కన వుంచిన మహర్షి తలను వారి మెడకు అతికించి జ్ఞానబోధను సంపూర్ణము గావించుకొని మహర్షి యొక్క శాపాన్ని తొలగించిన వారై వారి లోకములకు వెళ్ళిపోయారు.

దేవేంద్రునివలె కాకుండా నిజమైన ఆత్మేచ్ఛతో నిర్మలమైన మనస్సుతో పరిపూర్ణ వైరాగ్యముతో శ్రీ జగద్గురు ఆది శంకరాచార్యులు తమ **'సాధన పంచకము'** అను ఐదు శ్లోకముల లోని రెండవ శ్లోకంలో —

**సంగఃసత్సు విధీయతాం భగవతో భక్తిర్దృఢాధీయతాం,**
**శాన్త్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాశు సంత్యజ్యతామ్ ।**
**సద్విద్వానుపసర్ప్యతాం ప్రతిదినం తత్పాదుకా సేవ్యతాం,**
**బ్రహ్మైకాక్షరమర్థ్యతాం శృతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్ ॥**

అని తెలియపరచినట్లు, భగవంతుని యందు దృఢమైన భక్తి గలవాడై, శమ దమాది షడ్గుణములు కలవాడై కర్మలయందు, కర్మఫలాలయందు ఏమాత్రము ఆసక్తి లేనివాడై సద్వస్తువును చక్కగా ఎరిగిన జ్ఞానులను ఆశ్రయించి ప్రతిదినమూ వారి పదములను, పాదములను సేవించుతూ బ్రహ్మతత్త్వమును తెలిసికొనవలయునను తన ఆకాంక్షను వెల్లడిజేసి, వారు చెప్పిన శ్రుతి శిరస్సులైన ఉపనిషద్వాక్య బోధను శ్రద్ధగా వినాలి. ఇటువంటి వారే యథార్థతత్త్వాన్ని తెలిసికొనగలుగుతారు.

కారు నడుస్తుందంటే అది జడము గనుక కారులోని అన్ని పరికరములు చక్కగా వున్నా ఇంజిన్లో ఆయిల్ వున్నా స్టార్ట్ చేయనిదే దానంతట అది కదిలి ఎక్కడకూ వెళ్ళదు. ఉన్నచోటనే కాదు కాదు ఉంచిన చోటనే వుంటుంది. యజమాని తన కార్యం కొరకు ఎక్కడకు వెళ్ళాలని నిర్ణయించు కొని డ్రైవరుకు చెబుతాడో, డ్రైవరు దానిని ఆ గమ్యం వైపు పయనింపజేస్తాడు.

కాదు,కూడదు అనే స్వతంత్రం కారుకు గాని డ్రైవరుకు గాని లేవు. యజమానే డ్రైవరై నడిపినా తన లక్ష్యం మేరకు దానిని నడుపుకొంటాడు.

అదేవిధంగా ఈ శరీరం కూడా 'నేను' కు వాహనం లాంటిదేనని కఠోపనిషత్తు -

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।**

**బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**

**ఇన్ద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్ ।**

**ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥** (1-3-3/4)

అని తెలియపరచుచున్నది. 'నేను' యజమానియైతే పంచజ్ఞానేంద్రియములతో పంచ కర్మేంద్రియములతో కూడిన ఈ శరీరమే రథము అనగా వాహనము. దీనిని నడిపే డ్రైవరు బుద్ధి. ఇంద్రియాలను శాసించే మనస్సు కళ్ళెము. ఇంద్రియములే గుఱ్ఱములు. విషయములే వాటి ఆహారము. ఇంద్రియమనో బుద్ధులతో కూడిన ఈ 'నేను' ఆత్మయే భోక్త అవుతాడు.

బుద్ధీంద్రియము పనిచేయని పశు పక్ష్యాదులకు వలె మానవుడు కూడా తన శరీరేం ద్రియములతో వ్యవహారములుచేస్తూ బాహ్యవిషయములపైగల ఆసక్తితో పరుగులెత్తుతూ పడు తూ (చస్తూ) లేస్తూ (మరల పుడుతూ) వున్నాడే కాని ఎందుకు, ఏమిటి, ఎవరికొరకు, ఎలా? అని ఈ విధమైన ప్రశ్నలు వేసికొనడం లేదు. చైతన్య స్వరూపమైన తనను జడస్వరూపమైన శరీ రమును కలిపి 'నేను' అని వ్యవహరించుతూ శరీరావసరములే తన అవసరములుగా భావిం చుతూ శరీర సంబంధములే తన సంబంధములని పొరబడుతూ సంసారచక్రంలో పడి నలిగి పోతున్నాడు. మనకు వేసికొనడం రాని ప్రశ్నలను ఉపనిషత్తు వేస్తూ, సమాధానం ద్వారా మన యొక్క యథార్థ స్వరూపం వైపు పయనించేట్లుగా చేస్తున్నది.

**కేనేషితం పతతి ప్రేషితం మనః, కేన ప్రాణః ప్రథమం ప్రైతి యుక్తః ।**

**కేనేషితాం వాచమిమాం వదన్తి, చక్షుశ్శ్రోత్రం క ఉ దేవోయునక్తి?** (కే.1-1)

ఎవరి కోరికమేరకు, ఎవరిచేత ప్రేరేపింపబడి ఈ మనసు వ్యవహారంలో పడుచున్నది. అదేవిధంగా మనస్సు ప్రాణము, వాక్కు, కండ్లు, చెవులు ఎవరికొరకు ఎవరి శక్తిచేత వ్యవహ రించుచున్నవి అని విచారణ చేస్తే -

ఇంద్రియాలను ప్రేరేపించే మనసుకు, మనసును ప్రేరేపించే బుద్ధికి అధిష్ఠానమై ఈ శరీరమును నడిపిస్తున్న యథార్థమైన ఆత్మస్వరూపము -

**యద్వాచాऽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।**

**యన్మనసా న మనుతే యేనాహుర్మనోమతమ్ ।**

**యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి ।**

**యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్ ।**

**యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ।**

**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥** (కే.1-4 నుండి 1-8)

దేనిని వాక్కు చెప్పలేదో, మనస్సు ఊహించలేదో, కండ్లు చూడలేవో, చెవులు విన లేవో, ప్రాణము స్పందించలేదో-దాని ద్వారానే ఇవి శక్తిని పొందుచున్నవి గనుక దానిని ఇవి గ్రహించలేవు.

ఈ విషయమును ఒక చక్కని ఆఖ్యాయిక ద్వారా ఉపనిషత్తు వివరించుచున్నది.
ఒకసారి దేవేంద్రుడు సభలో అగ్ని, వరుణ, వాయుదేవుడు మరియు ఇతర దేవతలతో సహా కొలువుదీరి తాము రాక్షసులపై గెలుపొందిన తీరును వివరించుకొంటూ, తమ తమ శక్తి యుక్తులను పొగుడుకుంటూ పొంగి పోతున్నారు. ఆ సమయంలో ఒక పెద్ద ఆకృతి యక్షుని రూపంలో ప్రత్యక్షమై ఒక గడ్డి పరకను వారి ముందుంచి కాల్చమని అగ్నికి, తడపమని వరు ణునికి, ఎగరగొట్టమని వాయుదేవునికి, చెప్పినా వారాపని చేయలేకపోయినారు. తదుపరి దేవేంద్రుని ప్రార్థనమేరకు ఆ యక్షుని రూపం సౌమ్యమై ఉమాదేవిరూపంలో ప్రత్యక్షమై వారు తన శక్తి వలన ప్రేరేపించబడినవారై రాక్షసులను గెలువగలిగినారు కాని, లేదంటే వారికది సాధ్యం కాదని యథార్థం తెలియజేసి అదృశ్యమైనది.

అదేవిధంగా ఆత్మచైతన్యము లేనిదే ఇంద్రియములు జడములు. తనయొక్క నిజ శక్తి యుక్తులు తెలియకనే సంసార వ్యామోహంలో పడి విషయలంపటుడై జీవుడు సుఖదుఃఖ ములను అనుభవించుచున్నాడు. అందులకే శ్రీ శంకరార్యులవారు —

**వయసిగతే కః కామవికారః శుష్కే నీరే కః కాసారః ।**

**క్షీణే విత్తే కః పరివారః జ్ఞాతే తత్త్వే కః సంసారః ॥**

అంటూ భోధిస్తారు. యథార్థతత్త్వాన్ని తెలిసికొని ఈ సంసార సాగరాన్నుండి ఉద్ధరిం పబడాలి అంటే సద్గురువులను ఆశ్రయించి సత్సంగము ద్వారా తెలిసికొని దృఢ అపరోక్ష ఆత్మా నుభూతిని పొందవలయును. భగవంతుని దివ్యకరుణచేత సద్గురువుల కృపచేత అందరకూ యథార్థమైన ఆత్మానుభవము కలిగి పరమానందముతో విలసిల్లుదురు గాక !

॥ హరిః ఓం తత్సత్ ఓమ్ ॥



శ్రీ జగదీశ్వరానందగిరి స్వాముల వారు,
శ్రీ జగదీశ్వరాశ్రమ అధిపతులు,
అఖిల ఆంధ్ర సాధు  పరిషత్తు ప్రధాన కార్యదర్శి,
కోరుట్ల. 9949346659.

## ఆత్మజ్ఞానామృతము

ఆత్మజ్ఞానము తెలిసికోరన్నా,
సద్గురుని సేవచె జన్మధన్యము చేసుకోరన్నా ।
ఎన్నో జన్మల పుణ్య ఫలముచె- మానవుని జన్మంబు వచ్చెను ।
వయసుమల్లక ముందె నీవు, ఆత్మజ్ఞానము తెలిసికొనుము
॥ఆత్మజ్ఞానము॥

భవపయోధిలో మునుగబోకన్నా,
బ్రహ్మజ్ఞానము తెలిసికొని -నీవు మసలుకోరన్నా ।
ఎన్నిజ్ఞానము లున్ననేమి - బ్రహ్మజ్ఞానము లేకయున్నచో ।
అన్ని విధముల తన్ను రక్షణ చేయునదె ఆ బ్రహ్మజ్ఞానము
॥ఆత్మజ్ఞానము॥

ఎవరి ప్రేమను నమ్మ బోకన్నా,
అది ఎంతవరకో చివరివరకు తెలియదోరన్నా ।
ప్రేమ భావంబులను బెంచి - రాగమును దరిజేరనీయకు ।
రాగమే భవరోగమునకు - మూలమని నీ మదిని నమ్ముము
॥ఆత్మజ్ఞానము॥

ఆత్మస్తుతి పరనిందజేయకురా,
ఈ దేహమే నేననెడి భావన ఇంచుకుంచకురా ।
అఖల జీవులయందు వెలిగే ఆత్మరూపమె తానటంచును ।
సకల జీవుల సేవ జేయుచు - సర్వజీవుల కృపను పొందుము
॥ఆత్మజ్ఞానము॥

భ్రమయు రాగంబులును రెండన్నా,
బ్రహ్మతత్త్వము నెరుగకుండగ నడ్డు తగులన్నా ।
భ్రమయు రాగంబులును రెండే బంధమునకు మూలమగును ।
రాగ భ్రమలను రెండు విడిచిన- యోగస్థితి పొందుటయు సులభము
॥ఆత్మజ్ఞానము॥

భార్యబిడ్డల తోడ నున్నన్నా,
డాక్టరు సిష్టరు వలెనె సేవలు చేయుచుండన్నా ।
భ్రమలు రాగములేవి లేక - సుఖము దుఃఖము లేవి పొందక ।
రోగులకు సేవలను జేసెడి - వైద్యులా వలె నుండు గృహమున
॥ఆత్మజ్ఞానము॥

జన్మజన్మల నుండి వచ్చెనురా,
కర్మల సమూహము కరుడుగట్టి పెరుగుచున్నదిరా ।
బ్రహ్మజ్ఞానం బనెడి గంగా - జలమునందున కడిగి కర్మల ।
జన్మరహితం బైన బ్రహ్మతత్త్వమెరిగి సుఖము నొందుము
॥ఆత్మజ్ఞానము॥

దీపమందము జూచి మిడతయురా,
దీపమున జొచ్చి మృత్యువాత పడెను చూపుమురా ।
ఉష్ణత్వమెరుగక తనదు దేహము - అగ్నికాహుతి ఇచ్చి చచ్చెను ।
అటులె జగ భోగములు సుఖమని - విషయవిషమును గ్రోలుచుండిరి
॥ఆత్మజ్ఞానము॥

బోనునందున నున్న ఎలుకన్నా,
బంధమున నున్నని ముందటా హారమును తినదన్నా ।
ఎటులబంధము తొలుగునోయని - ఎన్నొ విధముల చేయు యత్నము ।
మనిషి భవ బంధమున జిక్కియు - ఎలుక కంటే హీనమయ్యెను
॥ఆత్మజ్ఞానము॥

దూరమున్న కొండలందమురా,
దగ్గరకు వెళ్ళిన రాళ్ళు రప్పలు ముల్ల పొదేలేరా ।
అటులె జగమం దముగ దోచును- జ్ఞాన దృష్టిలేని నరులకు ।
లేదు సంసారమున సుఖము - జ్ఞాన దృష్టిచె చూచు బుధులకు
॥ఆత్మజ్ఞానము॥

దుఃఖనిలయ మశాశ్వతం బనిరా,
ఈ లోకమును శ్రీకృష్ణ దేవుడు నొక్కి చెప్పెనురా ।
బుధులు జెప్పిన మాట పెడచెవి - బెట్టిజనులజ్ఞానవశమున ।
ధనము సంపాదనకె మొగ్గరి - ధర్మ దైవంబులను మరచిరి
॥ఆత్మజ్ఞానము॥

నేను నాది యనకు మోరన్నా,
ఈ రెండు బంధంబునకు మూలము వాటి విడువన్నా ।
నాది ఇదియని నేడు యంటవి - రేపు నాదని మరియొకండనె ।
ఏది ఎవరిది గుండ దెప్పుడు - నాది నాదని పోయిరెందరో
॥ఆత్మజ్ఞానము॥

జీవితం బొక మెరుపు వంటిదిరా,
జనునక వనిలో చావు యెప్పుడొ తెలియకున్నదిరా ।
మెరుపుకాలము జీవితమునకు - మురిసిపోవుచు తిరుగుచుండును ।
కన్ను మిన్ను కానకుండగ - కాలయమునకు జిక్కువరకు
॥ఆత్మజ్ఞానము॥

ఈ దేహము శాశ్వతము గాదన్నా,
ప్రతి నిమిషమందున గుర్తునుంచుకొనియు మెలగన్నా ।
శాశ్వతంబుగాని దేహము - శాశ్వతంబని నమ్ముచుంటివి ।
శాశ్వతంబగు అత్యదేవుని - పూర్తిగా నీవు మరచియుంటివి
॥ఆత్మజ్ఞానము॥

ఇంద్రియంబుల యందునోయన్నా,
మూడింద్రియంబుల జయమునొందుట కష్టమోయన్నా।
వాక్కు జిహ్వ గుహ్యములుయను - ఇంద్రియంబుల బలము గొప్పది ।
వాటిపై జయమొందలేక - ఎందరో అపజయము నొందిరి
॥ఆత్మజ్ఞానము॥

ఎంతో సాధన చేయవలెనన్నా,
వాక్కు జిహ్వ గుహ్యముల గెలుచుటకు నోయున్నా ।
వాటి గెలిచిన వాడు అవనిలో - ఇంద్రియంబుల నన్ని గెలుచును ।
ఆత్మతత్త్వము నొందుటకు- అతి సులభమగును వాట జయముచె
॥ఆత్మజ్ఞానము॥

ఆత్మరూపము గహన మోరన్నా,
అది లోనవెలుపల అంతటుండియు ఎరుగబడదన్నా ।
అఖిల భూతంబులకు - ఆధారముగనుండుచు ఎరుగబడకయె ।
సకల బుద్ధ్యాదీంద్రియములకు - శక్తి నొసగుచునుండె చిత్రము
॥ఆత్మజ్ఞానము॥

ఎన్నొ జన్మల పుణ్యఫలమన్నా,
ఆత్మ అనుభవ గురుడు దొరకుట దుర్లభంబన్నా ।
మానవత్వము బొంది యున్నను - మంచిగురుడు దొరకరున్నచొ ।
సంచితం బాగామికర్మలు - జ్ఞానమొందక నాశమొందవు
॥ఆత్మజ్ఞానము॥

ధ్యాన సాధన చేయవలెనన్నా,
ధరణి యందున కర్మలన్నియు దగ్ధమగునన్నా ।
ఎన్నో జన్మల యందు జేసిన - కర్మలూ సంచితముగుండెను ।
కర్మలన్నియు కాల్చినప్పుడె - జన్మలన్నియు తొలిగిపోవును
॥ఆత్మజ్ఞానము॥

బాహ్యచింతన విడిచిపెట్టన్నా,
నీ లోపలున్న చింతలన్నియు రూపుమాపన్నా ।
సకలచింతల విడిచినంతెనె - స్వస్థ చిత్తము నీకు గలుగును ।
స్వస్థచిత్తము నందె నీవు - సచ్చిదానందమును జూతువు
॥ఆత్మజ్ఞానము॥

ధ్యాతృధ్యానము విడిచి పెట్టన్నా,
క్రమముగా నీవు - ధ్యేయమందున మనసు నిలుపన్నా ।
గాలిలేని చోట దీపం - కదలనట్టుల మనసునుంచుము ।
మనసు విస్మృతి గలిగినంతనె - కలుగు నీకు సమాధి వెంటనే
॥ఆత్మజ్ఞానము॥

**శ్లో॥ గ్రాహ్యగ్రాహక సంబన్ధే, క్షీణే శాన్తి రుదేత్యలమ్ ।**
**స్థితిమభ్యాగతా శాన్తి మోక్షనామ్నాభిధీయతే ॥**

గ్రాహ్యవిషయము మొదట విడువన్నా,
ఆ పిమ్మట అగ్రాహకుడవై యుండుమోరన్నా ।
గ్రాహ్య గ్రాహక నిలుపుదల - నీలోన జరిగిన క్షణమునందే ।
ఆత్మతేజము వెలుగుచుండును - అదియె నీ నిజ ఆత్మరూపము
॥ఆత్మజ్ఞానము॥

ఊరకుండుట నేర్చుకోరన్నా,
అదియె ఉత్తమ యోగమని వేమన్న తెలిపెనురా ।
ఆత్మయందున మనసు నిలిపి - ఎట్టిచింతన చేయబోకని ।
గీతయందున కృష్ణదేవుడు - నొక్కి వ్యాఖ్యానించిచెప్పెను
॥ఆత్మజ్ఞానము॥

బ్రహ్మతత్త్వము నెరుగు మోరన్నా,
బ్రహ్మంబు నెరిగిన బ్రహ్మరూపంబగుదువోరన్నా ।
నామరూపము లేవి లేనిది - నాశమెప్పుడు బొందనట్టిది ।
అఖిల ప్రాణుల యందు నున్నది - అట్టిదిట్టిది అనగరానిది
॥ఆత్మజ్ఞానము॥

ఆత్మ చేతన రూపమోరన్నా,
అఖిలేంద్రియములకు సత్త నొసగెడి శక్తి యదియన్నా ।
ఇంద్రియంబులు జడములైనను - ఆత్మసత్తచె వెలుగుచుండును ।
అఖిలకార్యంబులను జేయుచు - నామరూపము లన్నిటుండెను
॥ఆత్మజ్ఞానము॥

హాయి గుండుట నేర్చుకోరన్నా,
అనుక్షణము నందున ఆలోచన లేకయుండన్నా ।
ఆలోచన లేవిలేని - క్షణమునందే హాయిగుందువు ।
హాయిగున్న స్థితిలో మానవు-డాత్మానందమును బొందును
॥ఆత్మజ్ఞానము॥

అఖిల చింతల నన్ని విడువన్నా,
ఆత్మరూప అనుభవమునకు మార్గమిదెయన్నా ।
ఆత్మ అనుభవమునకు అడ్డుగ- నున్నదొక్కటె చింతతెలియుము ।
చింత విడిచిన వెంటనే - చిన్మాత్రుడుగను నీవు యుందువు
॥ఆత్మజ్ఞానము॥

ఆత్మకెప్పుడు లేదు దేహమురా,
దేహమున నున్న మాత్రమున దేహంబుకాదన్నా ।
మూడు దేహంబులును గానిది - పంచకోశంబులకు వేరది ।
చతుర్వింశతి తత్త్వములకు - వేరుగుండును ఆత్మరూపము
॥ఆత్మజ్ఞానము॥

నిత్యవస్తువు నిత్యముండన్నా,
అనిత్య వస్తువు కాలగర్భమునందు బోవన్నా ।
అనిత్యమగు నీ దేహమందున - నిత్యవస్తువె నీ స్వరూపము ।
దేహమింద్రియాదులేవియు - నీ స్వరూపము కాదు తెలిసికొ
॥ఆత్మజ్ఞానము॥

యోగమను రాజ్యమున నుండన్నా,
మద మోహ రాగ శత్రువులపై జయమునొందన్నా।
వనములనియెడి గృహములందున - ఆత్మవిద్యా యనెడి కాంతితో।
సుఖమునొందుచు స్వాత్మరాజ్యము - నందు నానందమును బొందుము
॥ఆత్మజ్ఞానము॥

చింతనేమియు లేక యుండన్నా,
ఇసుమంత చింతన చిత్తమందున నుంచుకోకన్నా।
చింతనేమియు లేని స్థితిలో - చిత్స్వరూపము వెలుగుచుండును।
తత్స్వరూపమె నీదు రూపం - బంచు తన్మయ మొందుచుండుము
॥ఆత్మజ్ఞానము॥

అరచేతియందునె యుంది మోక్షమురా,
సంకల్ప నాశము కలిగినంతనె మోక్షమొందెవురా।
నామరూపములేవి దలువకు - నిశ్చలంబగు స్థితిలో నుండుము।
నీకు సంకల్పములె గలుగవు - కలుగు సంకల్పముచె బంధము
॥ఆత్మజ్ఞానము॥

నేను చిన్మాత్రుండ నంచన్నా,
చింతనను జేయుట ధ్యానమని నీ మదిలొ దలచన్నా।
నేను ధ్యానము జేయుచుంటిని - యనెడి భావము గూడ మరచితె।
నిర్వికల్ప స్థితిలో నుండెవు - ఆత్మ స్థితి నా క్షణమె నొందెవు
॥ఆత్మజ్ఞానము॥

త్రిపుటి రహిత స్థితిలొ నుండన్నా,
ఆపైన నీకు ఆత్మరూపము గోచరించన్నా।
త్రిపుటి రహిత స్థితిలొ నుండిన - త్రిగుణములు నీ దరికి జేరవు।
కామక్రోధములన్ని దగ్ధం - బయ్యి కోరికలన్ని బోవును
॥ఆత్మజ్ఞానము॥

మలిన మనసే బంధమోరన్నా,
మలినంబు లేని మనసె మోక్షము నిచ్చు నోరన్నా ।
శుద్ధమైన మనసె మోక్ష - మశుద్ధమైన మనసె బంధము ।
రాగ ద్వేష మోహ మలముల - జ్ఞాన జలముచె కడిగి వేయుము
॥ఆత్మజ్ఞానము॥

నిత్యముక్తుండవును నీవన్నా,
బంధమును మోక్షము మూడూకాలములందు లేవన్నా ।
అహంకారంబునకె బంధము - అహంకారంబునకె మోక్షము ।
బ్రహ్మరూపుడవైన నీకు బంధమోక్షము లెట్లు యుండును
॥ఆత్మజ్ఞానము॥

బంధమాత్మకు లేదు లేదన్నా,
బంధంబు యుండిన మోక్షముండుట పొసగు నోరన్నా ।
బంధమోక్షంబులును రెండు - భ్రమచె నీకు తోచుచుండును ।
బంధమోక్షంబులకు వేరగు - బ్రహ్మమే నీ నిజ స్వరూపము
॥ఆత్మజ్ఞానము॥

బాధలొచ్చిన బాధనొందకురా,
బ్రహ్మమువు నీవు - భ్రమలో జిక్కిన బాధ నొందెవురా ।
బాధలన్నియు దేహమునకే - బ్రహ్మజ్ఞానుల కుండవెప్పడు ।
జన్మ రహితము జేసికో గురు - సన్నిధిలో బ్రహ్మంబు నెఱుగుము
॥ఆత్మజ్ఞానము॥

ఎవని తిట్టుట తగదురోరన్నా,
యెవడైన తిట్టిన నీదు పాపము పంచుకొనురన్నా ।
నీదు పాపము పంచుకొనిన - వానికే నొక పంచ కప్పము ।
పుణ్యకార్యము చేయకుండగ - పాపమంతయు పోయినందుకు
॥ఆత్మజ్ఞానము॥

వివిధ దేహములందు నోరన్నా,
ఆత్మ ఒక్కటె - అదియె పరమాత్మంచు యెఱుగన్నా।
అండ పిండాండములు ఆత్మయె - బ్రహ్మాండములన్ని ఆత్మయె।
అఖిల లోకములన్ని ఆత్మయె - అణువు అణువు ఆత్మ రూపమె
॥ఆత్మజ్ఞానము॥

బ్రహ్మలోకము వెళ్ళితేమన్నా,
విష్ణులోకము వెళ్ళినను లాభంబు లేదన్నా।
శివుని లోకము వెళ్ళినను నీ - జనన మరణము లేవి దొలగవు।
ఆత్మసాక్షాత్కారమొందిన వారికే - భవ భయము పోవును
॥ఆత్మజ్ఞానము॥

జీవితంబొక పుష్పమోరన్నా,
ఆది దేవదేవుని పాద పద్మములందు నుంచున్నా।
జీవితమునకు లక్ష్యము-ఆ దేవ దేవుని పొందుటే యగు
అదియు చేయక నెన్ని జేసిన పిల్లకాయల బొమ్మలాటలె
॥ఆత్మజ్ఞానము॥

సారమేమియు లేదురోరన్నా
సంసారమందున భ్రమచె సారము తోచునోరన్నా
వ్రేలు నోట బెట్టి పిల్లడు-పాలుపాలని భ్రమసినట్టుల
విషయ సుఖముల లేదు సారము-ఉన్నదంతయు ఆత్మయందే
॥ఆత్మజ్ఞానము॥

పరమాత్మ తత్త్వము తెలియుటకురన్నా
పరమ సద్గురు శరణమొక్కటే మార్గమోరన్నా
ఎన్ని దైవంబులను గొలిచిన ఎన్ని శాస్త్రంబులను చదివిన
ఎన్ని జపవ్రతదీక్షలుండిన ఉన్న సత్యం బెరుగడెన్నడు
॥ఆత్మజ్ఞానము॥

ఎన్ని సంపదలున్ననేమన్నా
నిను మృత్యుదేవత కన్నులారక జూచుచుందన్నా
ఎప్పుడో ఏ క్షణమునో - నీవన్ని విడిచెడి కాలమొచ్చును
నిన్ను నీవే తెలిసి కొని-నీ జన్మ ధన్యము చేసికొనుము
॥ఆత్మజ్ఞానము॥

ఉపనిషత్తుల సారమోరన్నా
ఊరకనే యుండుట అనెడి స్థితిని పొందుటేరన్నా
సామస్యలకు సతమతము నొందక - సమత నెప్పుడు విడిచి పెట్టక
సచ్చిదానందమును తానని - సర్వవేళలొ స్థితిలో నుండుట
॥ఆత్మజ్ఞానము॥

ఆపదలలో బాధ పడకన్నా .
నీ హృదయమందున సంపదలలో పొంగిపోకన్నా
సంపదాపదలందు సమముగ -యుండుట భ్యాసమును చేయుము
సంపదాపదలన్ని క్షణికము - సర్వజనులకు కలుగుచుండును
॥ఆత్మజ్ఞానము॥
ఎవరు నీవారంచు దలువకురా
ఏ సమయమందున ఎవరు ఎవరీవారొ తెలియదురా
వారలును వీరలును నీవారంచు-బంధము పెంచుకోకుము
ఎవరు ఎవరికి తోడురారు వెళ్ళిపోయే నాడు నరుడా
॥ఆత్మజ్ఞానము॥
విషయ చింతన విడిచి పెట్టన్నా
దుఃఖంబులన్నిటి కదియె మూలంబంచు ఎరుగన్నా
విషయ రహితమె సుఖము నొసగును - విషయ చింతన దుఃఖమిచ్చును
విషయ రహిత స్థితిలో నుండిన విశ్వరూపుని చూడగలవు
॥ఆత్మజ్ఞానము॥

రాగమే మహా రోగమోరన్నా
అది జన్మజన్మల వెంటనంటి యు బాధ పెట్టన్నా
రాగరహిత స్థితియె మోక్ష ధామమునకు మార్గమగును
యోగ స్థితిలో యుండి దివ్య-ఆత్మ దర్శన మొందుచుండుము
॥ఆత్మజ్ఞానము॥

ఇల్లు సంపద జూచి మురియకురా
ఒకనాడు అన్నిటి విడిచిపెట్ట వలసి యున్నదిరా
గృహము సంపదలన్ని విడిచెవు -బంధుజాలము నంత విడిచెవు
గోచిమాత్రం బైనగాని -గొంచు బోని కాలమున్నది
॥ఆత్మజ్ఞానము॥

బ్రహ్మజ్ఞానము గలిగి యుండన్నా
భవరోగమునకు దివ్య ఔషధమిదియె తెలియన్నా
బ్రహ్మజ్ఞానము చేతనే నీ జన్మలన్నియు తొలిగి పోవును
అన్ని జన్మల పాపమంతయు-బ్రహ్మజ్ఞానము గలుగ దొలగును
॥ఆత్మజ్ఞానము॥

ఓం తత్సత్ ఓం



ప్రమిదె, తైలము, వత్తి మరియు అగ్గిపెట్టె అను ఈ నాలుగు ఉన్నప్పుడే దీపము వెలుగును. అట్లే, వైరాగ్యమను ప్రమిదె, భక్తియను తైలము, చిత్తైకాగ్రత అను వత్తి మరియు తత్త్వవిచారణ అను అగ్గిపెట్టె ఉన్నప్పుడే జ్ఞానజ్యోతి వెలుగును (ఆత్మానుభూతి కలుగును).
(శ్రీ మలయాళస్వాములవారు)



శ్రీ పరమాత్మానందగిరి స్వాములవారు,
అ.ఆం.సా.పరిషత్ ఉపాధ్యక్షులు,
శ్రీ మలయాళస్వామి లక్ష్మీనారాయణ
ఆశ్రమ పీఠాధిపతులు, గంగాపురం.

## త్రయోవేదాః

త్రయోవేదాః అనగా మూడు వేదములు.ఋగ్వేదం,యజుర్వేదం,సామవేదము. నాలుగవ వేదంగా పిలువబడేది అథర్వణ వేదము. ఈ వేదమును కొంతకాలం తదుపరి పై మూడు వేదా ల్లోని కొన్ని భాగములతో దీనిని రూపొందించినారు.కావున, త్రయోవేదాః(మూడు వేదములు) అన్నారు. శ్రీకృష్ణభగవానుడు బోధించిన శ్రీమద్భగవద్గీతలోగూడ మూడు షట్కములు అనగా కర్మషట్కము(1-6 అధ్యాయములు ), భక్తిషట్కము (7-12 అధ్యాయములు) మరియు జ్ఞానషట్కము (13-18 అధ్యాయములు) గా విభజించబడినాయి.

ప్రస్థానత్రయము అనగా శ్రీమద్భగవద్గీత, బ్రహ్మసూత్రములు మరియు ఉపనిషత్తులు అనునవి. లౌకికవ్యవహారములోగూడ మూడు సంఖ్యకు ఎంతో ప్రాశస్త్యముంది. త్రిమూర్తులు, త్రిలోకములు, త్రిగుణములు, బ్రహ్మముడికి మూడు ముళ్ళు.అట్లే వధువు మెడలో అలంకరించు మంగళసూత్రమునకు గూడ మూడు ముళ్ళు వేస్తారు.

ఈ సంఖ్యకుగల ప్రాధాన్యతను వైదికదృష్టితో చింతనజేస్తే జీవాత్మలో మూడు దోషాలు న్నాయి. ఎట్లు స్థూలశరీరములో వాత, పిత్త మరియు కఫరూప దోషములుండునో, వాటి నివారణార్థము ధన్వంతరి ఋషి, చరకముని మొదలగు వారు ఆయుర్వేద శాస్త్రమును చెప్పి యున్నారో, అట్లే అంతఃకరణమునందు (సూక్ష్మశరీరములో) గూడ 1.మలదోషము, 2.విక్షేప దోషము మరియు 3.ఆవరణ దోషము (అజ్ఞానము) అను మూడు దోషములుండును. వాటి నివారణార్థము కర్మకాండము, ఉపాసనాకాండము మరియు జ్ఞానకాండాత్మక వేదత్రయము ను పరమేశ్వరుడు ప్రకటము చేసెను.

1.**మలదోషము:—**మలదోషమనగా పాపదోషము. దీనినే అధర్మము, అపూర్వము మరియు అదృష్టము అని గూడ పర్యాయముగా చెప్పుదురు. ఇది జన్మాంతరములలో చేయ బడిన అశుభకర్మలచే గలిగిన అతిశయ సూక్ష్మ సంస్కారవిశేషము,అప్రత్యక్షము. కాని, యే పురుషుడు నిషిద్ధ కర్మలు చేయుటకు లేక శబ్దాది విషయాలను పొందుటకు ఇచ్ఛచేయునో, అతని అంతఃకరణములో **"మలదోషము"**న్నదని అనుమానము చేయవచ్చును.

ఈ మలదోషము నిష్కామకర్మ చేతను, సర్వభూతదయచేతను లేక ఈశ్వర(ఇష్టదేవత)

నామోచ్చారణ,ఆరాధనచేతను నివృత్తమగును.రీతిపూర్వక ఈశ్వరనామోచ్చారణచేత మలవిక్షేపములు – రెండు దోషములు నాశనమగును. అన్యమగు నిష్కామకర్మాదులచే కేవలము మలదోషము నశించును.

ఈ మలదోషము నివారణమగుటకై భగవంతుడు కర్మషట్కమును సూచించినాడు. నిష్కామ కర్మలనాచరించుట వలన మలదోషము నివృత్తమై అంతఃకరణము శుద్ధిపడును.

**కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**

**జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ ॥** (గీత.2-51)

**శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।**

**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥** (గీతా.2-52)

శుద్ధమైన (సమత్వ)బుద్ధిగలవారు నిష్కామకర్మానుష్ఠానపరులై కర్మవలన కలుగు ఫలమును విడిచి జన్మమరణమనెడు బంధమునుండి విడివడినవారై సర్వోపద్రవరహితమైన భగవత్ స్థానమును (బ్రహ్మపదమును) పొందుచున్నారు.

ఎప్పుడు నీయొక్క మనస్సు అజ్ఞానమనెడు కల్మషమును దాటగలదో, అప్పుడు వినదగిన అర్థమునుండియు,విన్న అర్థమునుండియు అనగా కర్మవిషయమునందు విరక్తినిపొందెదవు.

**శ్లో॥ కర్మాణి చిత్తశుద్ధ్యర్థం హ్యైకాగ్ర్యార్థముపాసనా ।**

**మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానం ఇతి వేదాన్త డిణ్డిమః ॥** (26)

అందువలన, శ్రీమద్భగవద్గీత రెండవ అధ్యాయము (సాంఖ్యయోగము) లో చెప్పబడిన 18 శ్లోకములు (54 వ శ్లోకము నుండి 72 వ శ్లోకము) వరకు చెప్పబడిన విధంగా కర్మలు నిష్కామభావం తో ఆచరిస్తే మలదోషము నివారణమై "స్థితప్రజ్ఞ స్థితి" కలుగును.

**శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్ ।**

**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥** (2-55)

భావం:—ఓ అర్జునా! మనస్సులోని కోరికలన్ని వదిలివేయాలి.ఆత్మద్వారా ఆత్మలోనే సంతృప్తి కలిగి ఉండాలి. అప్పుడతడు స్థితప్రజ్ఞుడనబడును.

అందుకే, భగవంతుడు చెప్పినట్లు చేయకపోతే అధోగతినొందగలరని హెచ్చరించియున్నారు.

**శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే ।**

**సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥** (2-62)

భావం:—విషయాలనుగూర్చి ఎల్లప్పుడు ఆలోచించే పురుషునికి వాటిపై ఆసక్తి కలుగు

తుంది. ఆ ఆసక్తి వలన విషయాలపై కోరిక పుడుతుంది. కోరిక తీరకపోతే క్రోధం కలుగు తుంది. దానిచే అధ్యాత్మ మార్గమునుండి పతితుడగును.

**౨.విక్షేప దోషము:—**చిత్తచాంచల్యమును విక్షేప దోషమందురు. ఎవని చిత్తము వేదాన్త శ్రవణాదులయందు లేక మహావాక్యార్థరూప స్వస్వరూపమునందు స్థిరపడుట లేదో మరియు ప్రాపంచిక విషయాలయందు పరుగిడుచున్నదో,అతని చిత్తము(చంచలము) **విక్షేప దోష** యుక్తమైయున్నదని తెలియవలెను.ఈశ్వరనామోచ్చారణ, అజపా(సోఽహం)మంత్రోచ్చారణ, ఈశ్వరమూర్తిధ్యానము మరియు నిర్గుణబ్రహ్మచింతన మొదలగు ఉపాసనలచే చిత్తైకాగ్రత గల్గి విక్షేపదోషము నివర్తింపబడును.

**శ్లో॥శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।**

**సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి॥** (గీత.౨-53)

నానావిధములైన అర్థవాదములను వినుటచేత యిదివరకు విక్షేపమును పొందియున్న నీ బుద్ధి యెప్పుడు పరమాత్మ ధ్యానమందు నిశ్చలమై స్థిరమైయుండునో, అప్పుడు నీవు పరమార్థజ్ఞానమును పొందగలవు.

ఈ దోష నివారణార్థము శ్రీమద్భగవద్గీత 7 వ అధ్యాయము నుండి 1౨ వ అధ్యాయము వరకు (భక్తి షట్కము) బోధించినది. విశేషంగా భక్తియోగము 13 వ శ్లోకం నుండి ౨0 వ శ్లోకం వరకు భక్తునియొక్క 36 లక్షణముల గూర్చి భగవానుడు తెలిపి యున్నాడు. ఇటువంటి భక్తుల లక్షణాలతో భగవంతుని ఆరాధించినట్లయితే విక్షేపదోషము తొలగును.

**శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।**

**నిర్మమో నిరహఙ్కారః సమదుఃఖ సుఖ క్షమీ॥** (1౨-13)

భావం:—సమస్త ప్రాణులపట్ల ద్వేషము లేనివాడును, మిత్రత్వము, కరుణ గలవాడును, అహంకార మమకారములు లేనివాడును, సుఖదుఃఖములను సమముగా భావించువాడును—నాకు అత్యంత ప్రియుడు, అన్నాడు భగవంతుడు.

**శ్లో॥ సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।**

**మయ్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్తస్సమే ప్రియః॥** (1౨-14)

భావం:—ఎల్లప్పుడు సంతృప్తితో నుండువాడును, ధ్యాననిష్ఠలోనుండువాడును, మనోనిగ్రహం సాధించినవాడును, దృఢనిశ్చయము గలవాడును, మరియు మనస్సును బుద్ధిని నాయందే సమర్పించిన నాయొక్క భక్తుడు నాకు చాలా ప్రియుడు.

పైనపేర్కొన్న గుణములు భక్తునిలో అలవడితే విక్షేపదోషం సులభంగా తొలగిపోవును.

**3.ఆవరణ దోషము:—**అనగా అజ్ఞానము. **"బ్రహ్మరూప ఆత్మను నేనెఱుగను"**అను వ్యవహారమునకు యేది హేతువో అది అజ్ఞానము. **"అహం బ్రహ్మ న జానామి"**అను ప్రతీతి యెవరి యందు గలదో, అతడు అజ్ఞానియగును. అతనికి తత్త్వజ్ఞానమును సంపాదించుట కర్తవ్యమై యున్నది. ఎందుకనగా, తత్త్వజ్ఞానముచేతనే అజ్ఞానము నివర్తించును. అన్యసాధనములచే కాదు.

**బోధోఽన్యసాధనేభ్యో హి సాక్షాన్మోక్షైక సాధనమ్ ।**

**పాకస్య వహ్నివజ్ఞానం వినా మోక్షో న సిద్ధ్యతి ॥** (ఆత్మబోధ ౨)

వంటచేయుటకు అగ్ని యెట్లు ముఖ్య కారణమో, అట్లే ఆత్మజ్ఞాన ప్రాప్తియే మోక్షమునకు యేకైకసాధనము. ఆత్మజ్ఞానమును పొందకుండా, యే యితర సాధన కార్యకలాపములచేతనూ మోక్షమును పొదుట యసంభవము.

**శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**

**తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥** (4-38)

భావం:—జ్ఞానము కన్న పవిత్రమైనదేదియును లేదు. అట్టి జ్ఞానమును యోగసిద్ధిని పొందినవాడు కాలక్రమమున తనయందే స్వయముగా పొందగలడు.

అందుకే, భగవంతుడు 13 వ అధ్యాయము నుండి 18 వ అధ్యాయము వరకు జ్ఞానముయొక్క ఆవశ్యకతను బోధించినాడు. ముఖ్యంగా 13 వ అధ్యాయంలో ఐదు శ్లోకముల ద్వారా జ్ఞానియొక్క ౨౦ లక్షణములు బోధించిరి.

**శ్లో॥ అమానిత్వమదంభిత్వమహింసా క్షాన్తిరార్జవమ్ ।**

**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః ॥** (13-7)

భావం:—తన్ను తాను పొగడక,యే ప్రాణికిని దుఃఖమును కలిగించక,ఓర్పు గలిగి యుండియు, గురువులను సేవించియు, శౌచము గలిగియుండియు,చిత్తచాంచల్యము లేనివాడై, మనోనిగ్రహం కలిగియుండాలి.

పై శ్లోకముల ద్వారా జ్ఞానియొక్క ౨౦ లక్షణములు బోధించబడినాయి. ఇవి అలవరచుకుంటే సాధకుని అంతఃకరణములో జ్ఞానోదయము కలిగి,అజ్ఞానము తొలగించబడును.

**"నాశ యామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా"** (గీత.10-11).

అంతఃకరణమునందున్నవాడనై ప్రకాశించుచున్న జ్ఞానదీపముచేత అంధకారరూప అజ్ఞానమును నాశనముజేయుచున్నాను.

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**

**తేషామాదిత్యవజ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥** (గీత.5-16)

అజ్ఞానమును జ్ఞానముచేత యెవరు నాశనము చేయుచున్నారో, అట్టివారికి జ్ఞానము సూర్యునివలె అనగా సూర్యుడు వస్తువులను ప్రకాశింపజేయునట్లు ఆ పరబ్రహ్మాస్వరూపమును ప్రకాశింప జేయుచున్నది.

ఇట్టి జ్ఞానమువలన,"**అత్యంత దుఃఖ నివృత్తి, పరమానంద బ్రహ్మ ప్రాప్తి**"రూప మోక్షము సిద్ధించును. జనన మరణమనియెడు సంసారచక్ర ము నుండి జీవుడు బయటపడి మోక్షమును బడయును. అందు నిమిత్తమై **"త్రయోవేదాః"** అని చెప్పుట, శ్రీమద్భగవద్గీత త్రిషట్కములుగా బోధించుటలో అంతరార్థం శాస్త్రసమ్మతంగా నిరూపించబడినది.

కావున, యీ మూడు దోషములను తొలగించుకొనుట కోసమే మానవ జన్మ వచ్చినద ని సాధకులు గ్రహించవలెను.

ఓం సర్వే జనాః సుఖినో భవన్తు

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః



కళాయి లేని పాత్రలో వండిన పప్పుపులుసు చెడిపోవును. అట్లే, కోపము మొదలైన దుర్గు ణములు కలవారి అనుష్ఠానములు వ్యర్థములై పోవును. (శ్రీ మలయాళస్వాములవారు)



పూజ్యశ్రీ మాతా శివానంద సరస్వతీ వారు,
(శ్రీ మాతా శివచైతన్య స్వామిని వారు)
చైతన్య తపోవన్, శ్రీశివకేశవ్ పీఠం సంస్థాపక
పీఠాధీశ్వరి, శివకేశవ్ నగర్, తాడేపల్లి.
522 502, ఆం.ప్ర.

**ఓం శ్రీ గురుభ్యోనమః**

''పుండరీక వరదుడు పండరి నాథుడు మనందరి ప్రాణనాథుడు''

**మహాయోగపీఠే తటే భీమరథ్యాం! వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః ।**
**సమాగత్య తిష్ఠంతమానందకందం! పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥**

క్షేత్ర అధిష్ఠాన దైవమైన శ్రీ రుక్మిణీ సమేత శ్రీ పాండురంగస్వామి శ్రీ చరణారవిందముల కు భక్తి శ్రద్ధాపూర్వక ప్రణామములు సమర్పిస్తూ... అఖిలాంధ్ర సాధు పరిషత్తు సభాధ్యక్షులు, కార్యదర్శి, తదితర మహాత్ములగు స్వామినీ స్వామివార్లందరికి హృత్పూర్వక ఓం నమో నారాయణాయ ప్రణామములు.

ప్రియ దివ్యాత్మస్వరూపులారా!మీ అందరికీ మా అభినందనలు.**"ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ; నేహనానాస్తి కించన"**ఉన్నదొక్కటే బ్రహ్మ,నానాత్వమన్నది ఏ కొద్దిగాను లేదు అని శ్రుతి వాక్యం. ఉదాహరణకు-బంగారం ఒక్కటే, నగలు అనేకం.బంగారం లేకుంటే నగ లేనే లేదు, ఉన్న బంగారమే నగలుగా భాసిస్తుంది-కనిపిస్తుంది. ఆ జ్ఞానంతో ఆయా నగలను ఆ యా పేర్లతో వ్యవహరిస్తూ, ఆ యా స్థానాల్లో అలంకరించుకుంటారు తెలివైనవారు.

అదే రీతిగా పరమాత్మ ఒక్కడే, ప్రపంచం అనేకం. నిత్యంగా ఉన్న పరమాత్మయందు అనిత్యమైన ప్రపంచం భాసిస్తుంది అనే జ్ఞానంతో పరమాత్మనే ప్రీతితో భక్తితో దర్శిస్తూ, ప్రపంచంలో వ్యవహరించేవారు జ్ఞానులు, మహాత్ములు.

ప్రపంచాన్ని మాత్రమే చూసి పరవశించే అజ్ఞానులు పరమాత్మను గుర్తించలేక గ్రుడ్డి వారుగానే ఎన్నోసార్లు జన్మిస్తూ, మరణిస్తూ, అనిత్య సుఖాలే నిత్యమని భావిస్తూ, భోగలాలసతో వాటిని సాధించడానికి అన్యాయంగ, అక్రమంగా జీవిస్తూ, అధోగతి పాలైపోతుంటారు. అట్టివారిని దయతో ఉద్ధరించడానికి, శిష్టులను రక్షించడానికి ప్రతియుగంలో అవతరిస్తుంటాను....

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥** అని స్వామి అన్నాడుగా.

పండరీపురంలో భీమానదీ తీరంలో మహాయోగపీఠంలో వేంచేసియున్నవాడు ఆనందకందుడు, అమృత స్వరూపుడు, శ్రీ కృష్ణచంద్రుడు సచ్చిదానంద పరబ్రహ్మ.

పండరీపురంలో పుండరీకుని నిమిత్తంగ పాండురంగ స్వామిగా ఇలవేల్పై అందరినీ తన వైపు ఆకర్షించుకుంటున్నాడు. కానీ...కొందరే ఆకర్షితులౌతారు. అయస్కాంతం ఇనుమును ఆకర్షిస్తుంది, కానీ తుప్పపడితే ఆకర్షింపలేదుకదా! ఐనప్పటికీ మిగిలినవారిని కూడా **"మమైవాంశః"** ''జీవులంతా నా అంశయే'' అంటూ ఏదోక రీతిగా వారికికూడా వివేకాన్ని కలిగించి ముక్తిని ప్రసాదిస్తాడు. అంతటి కరుణాసాగరుడు పరమాత్మ.

ఇంతకూ ఎవరీ పుండరీకుడు? పూర్వం ముచుకుందుడనే మహారాజు అసురులతో యుద్ధం చెయ్యటంలో దేవతలకు సహాయంచేయగా, దేవతలు విజయంపొంది, వరం కోరుకోమన్నారు రాజును. తత్క్షణమే నా రాజ్యానికి చేర్చమంటాడు.. రాజా!నీ రాజ్యం,నీ వారు ఎవరూలేరు, భూలోక కాలమానాన్ని బట్టి ఎన్నోయుగాలు గడిచిపోయాయి అన్నారు దేవతలు.

ముచుకుందుడు దీర్ఘకాలం యుద్ధంచేసి అలసిపోవటంవల్ల దీర్ఘకాలం విశ్రాంతి తీసుకోదలచి, ''ఏ ఆటంకాలు లేని స్థానాన్ని చేర్చండి నన్ను, తనని నిద్రలేపినవారు తన చూపుతో భస్మమౌగాక''అనే వరం దేవతలద్వారా పొంది ఒక గుహలో నిద్రపోసాగాడు. అదే ఈనాటి గుత్తికొండ బిలం, గుంటూరు జిల్లా.

శ్రీకృష్ణపరమాత్మ కాలయవనుడనే రాక్షసునితో పోరాడుతూ,వీడు ఏ ఆయుధంచేతా మరణించడని గ్రహించి, భయపడుతూన్నట్లు నటిస్తూ పారిపోతూ....ముచుకుందుడు నిద్రించే గుహలోకి దూరి, అదృశ్యమైనాడు. నిదురిస్తున్నది శ్రీకృష్ణుడేననే అపోహతో కాలయవనుడు ముచుకుందుని కాలితో తన్ని నిద్రాభంగం చేసాడు.అంతే, రాజుకున్న వరప్రభావంతో నేత్రములద్వారా ప్రసరించిన యోగాగ్నితో కాలయవనుడు కాలి, బూడిదయ్యాడు. వెంటనే ముచుకుందునికి శ్రీకృష్ణపరమాత్మ చిరునవ్వుతో దర్శనమిచ్చాడు. రాజు సంతోషంతో స్తుతించాడు. రాజా! నీ నిమిత్తంగ ఒక దుష్టుడు పావిముక్తుడయ్యాడు, వరం కోరుకో అన్నాడు పరమాత్మ.

తండ్రీ!ఈ జన్మ కర్మలు చాలు, నీవు ముకుందుడవు, ఈ ముచుకుందునకు మోక్షాన్ని ప్రసాదించు స్వామీ!అన్నాడు. రాజా!నీ అంతఃకరణలో రాగద్వేషాల సంస్కారం దాగి ఉంది. అవి సమసిపోవాలంటే మరొక జన్మనెత్తాలి. ఆ పై నీకు మోక్షమే అంటాడు పరమాత్మ.

ఆ ముచుకుందుడే మరు జన్మలో పుండరీకుడిగా జానుదేవ్ మరియు సత్యవతి దంపతులకు జన్మించాడు. అతని తల్లిదండ్రులు శ్రీకృష్ణుని ప్రియ భక్తులు.

పుండరీకుడు ఒకసారి తాను వెళ్ళేదోవలో కుక్కుటముని ఆశ్రమం దగ్గర నల్లగా, అతి

వికారంగావున్న ముగ్గురు స్త్రీలు వాకిలి శుభ్రంచేసి, నీళ్ళుజల్లి, ముగ్గులు పెట్టటం,వారలా చేయ గానే అత్యంత సౌందర్యవతులుగా మారి వెళ్ళిపోవటం చూసి ఆశ్చర్యచకితుడై వారిని ప్రశ్నించ గా వారు“తాము గంగ, యమున, సరస్వతులనే నదులమని, తమలో మునిగిన వారి పాపా లవల్ల తమకీ దుస్థితి వస్తుందని, కుక్కుటమునిలాంటి మహనీయుల సేవలో ఆ పాపాలన్నీ ప్రక్షాళనయై యధాస్థితికి వస్తుంటామని తెలిపారు. కుక్కుటమునికి అంతటి మహిమ తన మాతాపితరుల సేవతో వచ్చిందనికూడా తెలిపారు.”పుండలీకుడు అప్పటినుండి తన మాతాపి తరులకు అత్యంత భక్తి శ్రద్ధలతో సేవచేయసాగాడు.

ఒకసారి తన భక్తుని పరీక్షించదలచిన పరమాత్మ, పుండలీకుడు మాతాపితరుల సేవ చేస్తున్న సమయంలో వచ్చి బయటనుంచి పుండలీకా!అంటూ పిలిచాడు. పుండలీకుడు తాన ప్పుడు బయటకు వస్తే తన మాతా పితరులకు నిద్రా భంగమవుతుందని, అందుకని కొంత సేపు వేచి వుండమని తన చేతికి అందుబాటులో వున్న ఒక ఇటుకని విసిరి దానిమీద వేచి వుండమన్నాడు.

భక్తవశుడైన పుండలీకాక్షుడు పుండలీకుడు బయటకు వచ్చేదాకా ఆ ఇటుకమీదే నిలు చుని వుంటాడు. పుండలీకుని భక్తికి, మాతా పితరుల సేవాతత్పరతకు మెచ్చి వరం కోరు కోమనగా, అంతటి పుండలీకాక్షుడవైన నీవు, ఇంతటి అల్పుడైన ఈ పుండలీకుని అనుగ్రహిం చి దర్శనమిచ్చావు స్వామీ! ఇదే రీతిగా ఈ ఇటుక మీదే ఇలానే నిలుచుని భక్తులకు దర్శన మిచ్చి కరుణించమని కోరాడు. తథాస్తు అని, ఆనాటి నుండి ఈనాటి వరకేకాదు, యుగాం తం వరకు కూడా వయ్యారంగా రెండు చేతులూ నడుం మీద పెట్టుకొని, రాయబార కృష్ణు నిలా నిలుచున్నాడు. ఆ ఇటుకనే పీఠంగా స్వీకరించిన కారణంగా విఠలుడు అనే నామం ప్రసిద్ధమైనది. విఠ్ అంటే కన్నడంలో, మరాఠీలో ఇటుక, ఠల్ అంటే స్థానం “అదే మహా యోగ పీఠమ్”. **“విఠల విఠల జయ హరి విఠల”** ఈ నామాన్ని స్పష్టంగా ఉచ్చారణ చేస్తే గుండెకున్న జబ్బు పోతుం దని వైజ్ఞానికంగ నిరూపించారు.

పండలీపూర్ యొక్క పూర్వనామమైన పండరాగా అనే పదాన్ని సంస్కృతీకరిస్తే పాండు రంగ అయ్యింది. ఆ స్థానంలో ఆవిర్భవించిన స్వామి కాబట్టి పాండురంగ స్వామి అయ్యాడు.

మన భారత దేశంలో ఆంధ్ర రాష్ట్రంలో ప్రసిద్ధి చెందిన తిరుమలవలె మహారాష్ట్రలోని పండరిపురం వైష్ణవ క్షేత్రం. భీమా నదీ తీరాన వెలసిన ఈ పుణ్యక్షేత్రం షోలాపూర్ జిల్లాలో ఉంది. ఇక్కడ శ్రీ మహావిష్ణువు విఠోబా పేరుతో వెలసియున్నాడు

పుండలీకుడేకాదు... ఇక్కడ స్వామిని కొలిచి, స్వామితో ఆడి, పాడి, సహపంక్తి భోజనం

చేసి తరించిన భక్తులు ఎందరో. వారిలో కొందరు.. శ్రీ రామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు, జ్ఞానేశ్వర మహారాజ్, జనాబాయి, నామదేవుడు, గోరా కుంభారుడు, సక్కుబాయి,, సమర్థ రామదాసు, పురందరదాసు మొదలగువారు ఎందరో. జగద్గురువు శ్రీ శంకరాచార్య స్వామివారు ఇక్కడికి వచ్చి పాండురంగాష్టకం రచించి కీర్తించారు. మనమంతా స్తుతించి, స్వామి అనుగ్రహానికి పాత్రులమగుదుముగాక!

**జై రాధేశ్యామ్. జైజై విఠల, జయ హరి విఠల.**



**అహంకారో ధియం బ్రూతే, మా సుప్తం ప్రతిబోధయ ।**

**ఉత్థితే పరమానందే న త్వం నాఽహం నవై జగత్ ॥**

(శ్రీవేదాన్త బాలబోధము తొమ్మిదవ ఉపదేశము)

ఆత్మయగు పతికి బుద్ధియను పత్ని గలదు. ఆ ఆత్మ అజ్ఞానమను నిద్రయందు అనాది కాలముగా నిద్రించుచున్నది. బుద్ధియగు పత్ని అహంకార (దేహాభిమాన)రూప జార (వ్యభిచార) ముచే చెడినది. అందుచే జగద్రూప పుత్రుని కనెను. పిమ్మట ఎప్పుడు శ్రీ బుద్ధి సత్సంగమను చెలికత్తెల ఉపదేశముచే ఆత్మను పొందు (ఆత్మజ్ఞానమును పొందు)చున్నదో, అప్పుడు బుద్ధిని జూచి అహంకారము *"నిద్రపోవువానిని లేపవలదు. ఏలయన ఈ పరమానందరూపము మేల్కొనినచో నీవుండవు, నేనుండను, జగముండదు. అన్నిటికి అజ్ఞానరూప మూలముతో తొలగుటరూప బాధ కలుగుచున్నది."* అని చెప్పినది. అయినను ఉత్తమజాతి కన్యవలె ఉత్తమ సంస్కారము గలదై బుద్ధి బాధరూప ప్రాయశ్చిత్తము కొఱకు వానిని లేపుచున్నది - అని అర్థము.



శ్రీ కృష్ణానందపురి స్వాముల వారు,
శ్రీ వాసవి శాంతి ధామ క్షేత్ర పీఠాధిపతి,
పెనుగొండ, పశ్చిమ గోదావరి జిల్లా,
పిన్ కోడ్. 534 320 ;
Cell : 94408 64509

## ఓం శ్రీ సద్గురుభ్యో నమః

అఖిలాండకోటి బ్రహ్మాండనాయక ఆదిమధ్యాంత రహిత అఖండ సచ్చిదానంద స్వరూపుడయిన ఆ సర్వేశ్వరునికి ఓం తత్ సత్ వరేణ్యులైన సద్గురుమూర్తికి, వేదికనలంకరించిన చర నారాయణ స్వరూపులైన సాధు మహాత్ములకు, సాధు మాతాజీలకు అభిన్న ఆత్మీయులైన మీ అందరికీ నా హృదయపూర్వక ప్రణామములు సమర్పిస్తూ, సద్గురుకృపచే కొన్ని విషయములను మీముందు ప్రకటించుటకు ప్రయత్నిస్తున్నాను.

మనము వేదాంతము, ఆధ్యాత్మికము, ధర్మములు, వైరాగ్యము, నీతులు, సూక్తులు, శాస్త్రములు, ఆరోగ్యసూత్రాలు Teaching కి అలవాటు పడ్డాము. కానీ Treatment కి అలవాటు పడలేదు. ఒక ప్రఖ్యాత వైద్యుని దగ్గరకు వెళ్ళి మనము out Patient గానో, లేక in Patient గానో specialward Patient గానో, I.C.U Patient గానో,operation గానో లేక శరీరములోని భాగాలు మార్పిడి గానో వైద్యం చేయించుకుని ఆరోగ్యాన్ని కుదుటపరచుకుని ఆనందంగా జీవిస్తున్నాము. అలాగున సద్గురువులను ఆశ్రయించి మనము ఈ మానవ జన్మకి ఆధ్యాత్మికంగా వైద్యం చేయించుకుని జనన మరణ - కర్మబంధమునుండి విముక్తిజెంది భగవంతునిలో కైవల్యము చెందాలి. బ్రహ్మానందంగా ఉండాలి.

మానవులు అనగా జీవులు మనిషిగా జన్మించారు. కానీ మానవత్వాన్ని, నైతిక విలువలను, సంస్కృతిని, సాంప్రదాయమును, సదాచారమును, పరమార్ధ సాధనలను, ధార్మిక జీవితమును విడిచి మానవ దానవులు గానూ **खाना पीना मजा करना; Earning and Enjoying** ఇదే జీవితలక్ష్యాలుగా పెట్టుకుని జీవితాన్ని సార్ధకంచేసుకోకుండా,Disposal Glass గా వాడుకుంటున్నారు. శాస్త్రములు ఇట్టి మానవుని ద్విపాదపశువు అని పిలుస్తున్నాయి. ఇంకా మూర్ఖుడా! అని కూడా అంటున్నాయి. జీవిత సార్ధక్యాన్ని గుర్తించటం లేదు. మన ఋషులు, పూర్వీకులైన మహాత్ములు, సద్గురువులు, శాస్త్రములు మానవుడు దానవుడుగా కాకుండా, గురువులు, శాస్త్రాలు, మహాత్ములను ఆదర్శంగా తీసుకుని మానవత్వంతో తన వర్ణాశ్రమ ధర్మాన్ని అనుసరించి మానవులుగా జీవించాలి - అని చెబుతున్నారు.

వేదాలలో మన హిందూ ధర్మశాస్త్రాలలో గర్భాదానము మొదలు శిశువు జన్మించి పెరిగి పెద్దయ్యి, జీవితంసాగించి, మరణించి, స్మశానానికి వెళ్ళిన తరువాత కూడా అంత్యేష్టి కర్మల వరకు షోడశ సంస్కారములను కుల, మత, స్త్రీ, పురుష నపుంసక, వర్ణ, బేధాలు లే కుండా అందరి మానవులకు సమానంగా విధులు యేర్పాటు చేయబడినవి. ఇవి పునర్జన్మలకు ఆదర్శంగా, మార్గదర్శకముగా సహకరిస్తాయి.

ధర్మము, అర్థము, కామము మరియు మోక్షమనబడు చతుర్విధ పురుషార్థములలో ధర్మయుక్తమైన అర్థసంచయము మరియు కామమును మోక్షముతో జోడించి (మోక్షకామన గలిగి) జీవితమును గడిపినచో, అది మన కళ్యాణమునకు దోహదపడుతుంది. శాంతిదాయ కంగా, ఆనందయుతంగా పరమార్థాన్ని చేకూర్చేటట్టుగా ఉపకరిస్తుంది.Simple living, High thinking అని చెప్పినట్లుగా - మన శాస్త్రాలను, మహాత్ములయొక్క జీవితచరిత్రలను ఆదర్శంగా తీసుకుని జీవనయాత్రను సాగించాలి.

యోగశాస్త్రములో (౭-౨౯) అష్టాంగ యోగములు [1.యమ ౨.నియమ ౩.ఆసన 4. ప్రాణాయామ 5.ప్రత్యాహార 6. ధారణ ౭. ధ్యాన 8. సమాధి] చెప్పబడినవి. ఈ అష్టాంగ యోగ ములతో సాధన చతుష్టయ సంపత్తిని - 1.నిత్యానిత్య వస్తు వివేకము, ౨.ఇహాముత్ర ఫలభోగ విరాగము, 3.శమాది షట్కసంపత్తి (శమ, దమ, ఉపరతి, తితిక్షా, శ్రద్ధ మరియు సమాధాన ము) 4.ముముక్షుత్వము - పట్టుబడి పరిపూర్ణ అధికారియై **"తద్విజ్ఞానార్థం స గురుమేవాభి గచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"** (ముం.1-౨-12) అను శ్రుత్యుక్త ప్రకారముగా సద్గు రువునకు శరణుబొంది, యథోచిత పరిచర్యలచే సద్గురుదేవుని కృపకు పాత్రులమై, శ్రీగురు దేవుని ముఖారవిందమునుండి తత్త్వమస్యాది మహావాక్యములను శ్రుతిషడ్లింగ సహితముగా **"ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యః నిదిధ్యాసితవ్యః"** (బృ.౨-4-5; 4-5-6) అను శాస్త్రోక్తి ననుసరించి శ్రవణ మనన నిదిధ్యాసముల నొనర్చి - కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన మార్గముల ద్వారా సంశయ విపరీతభావనాది ప్రతిబంధరహిత దృఢ అపరోక్ష బ్రహ్మజ్ఞానమును బడసి, మిథ్యాత్వనిశ్చయరూప జగద్బాధము చేసి, అజ్ఞాననివృత్తి ద్వారా నిత్యప్రాప్తము స్వతస్సిద్ధమైన మన నిజస్వరూపమునగు మోక్షమును పొందాలి.

ఇదే సకలశాస్త్రముల సారాంశము. వాచా వేదాంతము కాకుండా, దృఢ అభ్యాసము తో - వివేకముతో, ఆచరణయుక్త పూర్ణ అనుభవమును పొంది సదా సచ్చిదానంద స్వరూపులమై విలసిల్లుదుము గాక! ఓం తత్ సత్ ఓమ్.



శ్రీ అఖండానన్దగిరి స్వామీజీ
శ్రీ వ్యాసాశ్రమము
Cell: 8309166125

## "ఉపేయమున కాదు,
## ఉపాయమునందే అధికయత్నము"

ఓం శ్రీ గురుభ్యోనమః

**శ్లో॥ పాణ్డురఙ్గం పరేశానం, రుక్మిణీ పతిమవ్యయమ్ ।**
**పుణ్డరీకాది భక్తానాం, అఖణ్డ జ్ఞానదం భజే ॥**

శ్రీమదఖండ జ్ఞానస్వరూపులగు పూజ్య సాధు బృందమునకు వందన మందారాలు. అఖిలాంధ్ర సాధుపరిషత్ అధ్యక్షులు శ్రీమాతా పరావిద్యానందగిరి స్వామిని వారికి, ఈ 58 వ సభ (తేది 29, 30, 31 -1-2024 లో) జరిగిన శ్రీక్షేత్రమైన శ్రీపాండురంగ పుణ్యక్షేత్రములో కొలు వైయున్న శ్రీవిఠల భగవానునకు నమశ్శతములు.

అందరికీ కావలసినది తఱగని చెఱగని ఆనందము. అదియే అఖండమైన ఆనందము. అది అభేద దర్శనము వలననే సిద్ధిస్తుంది. రాముడు వేఱు, విఠలుడు వేఱు, శివుడువేఱు, అమ్మవారు వేఱనే దురాగ్రహమువలన సిద్ధించదు.

**క్రియా దక్షో దక్షః క్రతుపతి రధీశః ....** (శివమహిమ్న స్తోత్రము)

అన్నట్లు, దక్షప్రజాపతి కూడా శివనిందజేసి తలపోగొట్టుకొని, మేక తలతో శివుని శరణు పొందవలసివచ్చింది కదా! **"శివకేశవయోరభేదః".** కాని, కొందరు విశాల అధ్యయ నము గంభీరముగా చేయక, శాస్త్రరహస్యములను తెలిసికొనజాలకయు, అంతఃకరణము శుద్ధిలేని కారణముచేతను-యథార్థ తత్త్వజ్ఞానానందమును పొందజాలక పోవుచున్నారు.

**"తపోభిః క్షీణ పాపానాం......"**(ఆత్మబోధ 1)అన్నట్లు, జప తప స్వాధ్యాయాదుల ద్వారా అంతఃకరణాంతర్గత మల,విక్షేప, ఆవరణదోష రాహిత్యమైన మాత్రమే పొందగలరు. కొందరు భగవద్గీతాది పవిత్ర గ్రంథములను పారాయణాదులు చేసినప్పటికీ సరైన అర్థచింతన చేయలేక పోవుచున్నారు. **"రుద్రాణాం శఙ్కరశ్చాస్మి"** (గీత.10-23) నేను శంకరుడను, భగవద్గీత వ్రాసే వ్యాసునిగా నేనే వున్నాను-**"మునీనా మప్యహం వ్యాసః"** (గీత.10-37). అంతేకాదు, వాహన మైన గరుత్మంతుడూ నేనే **"వైనతేయశ్చ పక్షిణామ్"** (గీత.10-30); చెప్పేవాడిని నేనే, వినేవా

డిని కూడా నేనే-"**వృష్ణీనాం వాసు దేవోఽస్మి, పాణ్డవానాం ధనఞ్జయః ।**"(గీత.10-37); "**మత్తః పరతరం నాన్యత్ కిఞ్చిదస్తి ధనఞ్జయ**"(గీత.7-7) అని శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణుని ఉవాచ కాదా!

**యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి ।**

**సర్వభూతేషు చాత్మానం తతో న విజిగుప్సతే ॥** (ఈశావాస్యోపనిషత్ 6)

అంతటా అన్ని ప్రాణులయందు తననూ, తనలోనే అన్నిప్రాణులనూ చూడగలిగిన వాడు దేనినీ జుగుప్సా(అసహ్య) భావముతో చూడడు.

భగవత్తత్త్వము కంటే అణుమాత్రమైననూ వాస్తవికము కాదు, పారమార్థిక సత్యము ఒక్కటే. "**ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ**"(పైఙ్గలోపనిషత్ 1-1); "**నేహ నానాస్తి కిఞ్చన**" (బృ.4-4-19) అద్వితీయమైన బ్రహ్మ కంటే భిన్నము ఆణుమాత్రమైన లేదు."**యజ్ఞాత్వా ముచ్యతే జంతుః**"; "**జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః**" (శ్వే.4-16). అట్టి అద్వితీయ తత్త్వమును తెలిసినవారే ముక్తులు.

బంగారముతో చేసిన శ్రీకృష్ణుని విగ్రహములోని పాదరక్షలు, కిరీటము, కట్టుకున్న పీతాంబరము బంగారమే కదా!ఉత్తరీయమూ బంగారమే, నెమలి పింఛమూ సువర్ణమే, చేతిలో పట్టుకొని పెదవుల దగ్గర పెట్టుకొన్న పిల్లన గ్రోవి(మురళి) కూడా సువర్ణమే. "**సర్వం ఖల్విదం బ్రహ్మ**"(ఛాం.3-14-1); "**నేహ నానాస్తి కిఞ్చన**". కనుక, దురాగ్రహములను విడిచిపెట్టి పారమార్థిక సచ్చిదానంద అద్వయ అఖండానందస్వరూపమగు తన నిజస్వరూపమును తెలియజేయు ఉపాయముల యందే అధికయత్నములు చేయవలెను—అనగా,

"**ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః ।**" (బృ.2-4-5)

**శ్రవణం తు గురోః పూర్వం, మననం తదనన్తరమ్ ।**

**నిదిధ్యాసనమిత్యేతత్పూర్ణ బోధస్య కారణమ్ ॥** (శుకరహస్యోపనిషత్ 3-13)

**శ్రోతవ్యో శ్రుతివాక్యేభ్యః మన్తవ్యశ్చోపపత్తిభిః ।**

**మత్వా చ సతతం ధ్యేయః ఏతే దర్శన హేతవః ॥**

ఇత్యాది శాస్త్ర ప్రామాణ్య ప్రాబల్యముచే, అద్వైతవేదాంత శ్రవణము, మననము, నిదిధ్యాసనములు చేసి జీవన్ముక్తులమై వెలుగొందెదము గాక !

శ్రీ పంఢరీ పురవాసునికి యథాశక్తి వాక్పుష్పాంజలి సమర్పిస్తూ —

ఓమ్ - శమ్

★ ★ ★

# శ్రీ పాణ్డురఙ్గాష్టకమ్

పాణ్డురఙ్గం పరేశానం, పాపభఞ్జక మచ్యుతమ్ ।
భక్తానాం పాలకం వన్దే, పణ్ఢరీపురవాసినమ్ ॥ ౧ ॥
విఠలం రుక్మిణీ నాథం, సేవయాలబ్ధమాధవమ్ ।
మాతృ పితృ కృపా ప్రాప్తం, వన్దేఽహం నన్దనన్దనమ్ ॥ ౨ ॥
గోవిన్దం పుణ్డరీకాప్తం చన్ద్రభాగా విహారిణమ్ ।
గోపికా గోపదైవం శ్రీపాణ్డురఙ్గం భజేన్యహమ్ ॥ ౩ ॥
కటిహస్తం కళానాథం కల్పనాతీతమవ్యయమ్ ।
కాళిన్దీ కేళినం వన్దే, శ్రీకృష్ణం శివమద్వయమ్ ॥ ౪ ॥
దుష్కరో ముష్కరాణాం చ, యశస్కరోతి మాం సదా ।
తస్కరం క్షీరసారాణాం నమస్కరోమి మాధవమ్ ॥ ౫ ॥
హృదయే నాస్త సర్వాస్థం మనస్కరోమి సుస్థిరమ్ ।
ప్రణౌమి పాణ్డురఙ్గాఖ్యం సహస్రభాస్కరప్రభమ్ ॥ ౬ ॥
నిష్కామకర్మ సమ్పన్నాత్ భక్త్యా జ్ఞానం వివర్ధతే ।
సోఽహంభావ ప్రబోద్ధారం, భజే 'జ్ఞానీ తు' వాదినమ్ ॥ ౭ ॥
ఏకనాథ తుకారామ జనా గోరాది తారకమ్ ।
జ్ఞానేశ్వరాది భక్తానాం, అఖణ్డ జ్ఞానదం భజే ॥ ౮ ॥
పణ్ఢరీపుర నాథస్య కృపయాఽష్టకమీరితమ్ ।
అఖణ్డానన్దగిర్యాఖ్య స్వామినాద్భుతమిష్టదమ్ ॥ ౯ ॥

ఇతి శ్రీపణ్ఢరీపుర పాణ్డురఙ్గాష్టకమ్

ఓం తత్సత్ ఓం





స్వామి బ్రహ్మవిద్యానన్ద,శ్రీ సద్గురు మహర్షి
మలయాళస్వామి ఆశ్రమము, Plot no.48,
కళావతీనగర్, M.I.D.C. సోలాపూర్,
మహారాష్ట్రము, Pin: 413006.
Cell: 7017550722

ఓం శ్రీ సద్గురుభ్యో నమః

**—: ఆత్మని అజ్ఞానం సుతరామపి నాస్తి :—**

**ఓం..... ఓం..... ఓం.....**

**శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్ ।**
**సూత్ర భాష్యకృతౌ వందే భగవన్తౌ పునః పునః ॥**
**యుక్తాహార విహారాయ వివిక్త స్థలవాసినే ।**
**మలయాళ యతీన్ద్రాయ బ్రహ్మనిష్ఠాయ తే నమః ॥**
**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః**

★ ★ ★

ఆత్మీయులారా! ఈరోజు విషయమును చర్చించుటకు పూర్వము కించిత్ ఉపోద్ఘాతమును చెబుతాను. ఉపోద్ఘాతమనగా, **"ప్రతిపాద్యమర్థం బుద్ధౌ సంగృహ్య తదర్థమర్థాంతర కథనమ్-ఉపోద్ఘాతః"** ప్రతిపాదించదలచిన విషయమును బుద్ధిలో ఉంచుకొని, దానికి సంబంధించిన అన్యవిషయమును ముందుగా చెప్పుట-ఉపోద్ఘాతమందురు.

'లక్షణ ప్రమాణాభ్యాం హి వస్తుసిద్ధిః' అను నియమమునను సరించి **"అజామేకాం లోహిత శుక్లకృష్ణాం** (శ్వే.4-5);"**దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్**"(శ్వే.1-3);"**అనృతేనహి ప్రత్యూఢాః**" (ఛాం.8-3-2);"**నీహారేణ ప్రావృతాః**" (తై.సం 4-6-2);"**దైవీ హ్యేషా గుణమయీ**" (గీత 7-14); **అజ్ఞానేనావృతం జ్ఞానం** (5-15); మున్నగు ప్రమాణములు అజ్ఞాన విషయంలో గలవు.

**"ఆవరణ విక్షేపశక్తులుగల అనాది అనిర్వచనీయ భావరూప పదార్థమునకు అజ్ఞానమందురు"** - ఇది అజ్ఞానముయొక్క లక్షణమగును.

ప్రత్యగభిన్న పరమాత్మను ఆవరించు (తెలియకుండాజేయు)శక్తి మరియు లేనిదేయగు దేహాదిక ప్రపంచమును సృజించి చూపెట్టు విక్షేప శక్తి-ఈరెండు శక్తులు అజ్ఞానమునకు గలవు.

అజ్ఞానమునకు ఉత్పత్తి(పుట్టుక) లేదు,గావున అనాదియగును.బాధయోగ్యము మరియు స్వరూపము గలదగుట వలన అజ్ఞానము అనిర్వచనీయమనబడును.**'నేను అజ్ఞానిని'** అను అనుభవమును బట్టి ఒకానొక భావరూప అజ్ఞానమున్నదని సిద్ధించుచున్నది.

ఆవరణ విక్షేప శక్తులు :—

**శక్తిద్వయం హి మాయాయా విక్షేపావృతిరూపకమ్ ।**

**విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్సృజేత్ ॥**

**అంతర్దృగ్దృశ్యయోర్భేదం బహిశ్చ బ్రహ్మ సర్గయోః।**

**ఆవృణోత్యపరాశక్తిః సా సంసారస్య కారణమ్ ॥** (సరస్వతీ రహస్యోపనిషత్ 17,18,19)

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః ।** (గీత.7-25)

**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ।** (గీత.5-15)

అనాది :—

**అనాది భావరూపం యద్విజ్ఞానేన విలీయతే ।**

**తదజ్ఞానమితి ప్రాజ్ఞా లక్షణం సంప్రచక్షతే ॥** (చిత్సుఖీ 1-9)

ఏది అనాది భావరూపమైయుండి విజ్ఞానముచే విలీనమగునో దానిని అజ్ఞానమని, విజ్ఞులు అజ్ఞానముయొక్క లక్షణమును చెప్పుదురు.

**అనాది మాయయా సుప్తో** (మాండూక్య కారికా ఆగమ.ప్ర. 16)

**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి** (గీత-13-19)

**జీవ ఈశో విశుద్ధా చిత్ తథా జీవేశయోర్భిదా ।**

**అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః ॥** (సాంప్రదాయిక శ్లోకము)

1.జీవుడు,2.ఈశ్వరుడు,3.జీవేశ్వరభేదము,4.శుద్ధచైతన్యము(బ్రహ్మము),5.అవిద్య(మాయా,అజ్ఞానము,ప్రకృతి) మరియు 6.అవిద్య చైతన్యమునకుగల సంబంధము-ఈఆరు అనాదులనబడును. **ఉత్పత్తి రహిత వస్తువును అనాదియందురు.**

అనిర్వచనీయము :—

**సచ్చేన్న బాధ్యేత అసచ్చేన్న ప్రతీయేత, తస్మాత్ సదసద్విలక్షణత్వాత్ అజ్ఞానం, తత్కార్యం చ అనిర్వచనీయమితి సిద్ధమ్**-అద్వైతసిద్ధౌ శ్రీమధుసూదన సరస్వతీభిఃఉక్తమ్.(690పేజీ,స్వామి యోగీంద్రానంద)**అజ్ఞానం తుచ్ఛాఽప్యసతీ కాలత్రయేఽపి పామరాణాం వాస్తవీ చ సత్వబుద్ధిర్లౌకికానామిదమిత్థమిత్యనిర్వచనీయా వక్తుం న శక్యతే మాయా** (సర్వసారోపనిషత్. 6)

**తుచ్ఛానిర్వచనీయా చ వాస్తవీ చేత్యసౌ త్రిధా ।**

**జ్ఞేయా మాయా త్రిభిర్బోధైః శ్రౌత యౌక్తిక లౌకికైః ॥** (వే.పం.6-130)

భావరూపము :—

**యత్కించిదితి వదన్న్యహమజ్ఞః ఇత్యాద్యనుభవాత్ ।**

'నేను అజ్ఞానిని' అను అనుభవమునుబట్టి ఒకానొక భావరూప అజ్ఞానమున్నదని సిద్ధించుచున్నది."**దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్**"(శ్వే.1-3)ద్యోతనశీలుడగు మాయావి మహేశ్వరుడగు పరమాత్మయొక్క త్రిగుణాత్మక శక్తి, భావరూపమగు అజ్ఞానము గలదని యర్థము.

ఇచ్చట కించిద్విచారించవలసియున్నది.'**నేను అజ్ఞానిని**'(అహంఅజ్ఞః) అను అనుభవమునుబట్టి అనాదియగుఅజ్ఞానమొకటున్నదని స్వీకరించబడుచున్నది.కాని,యెవరైతే **'నేను అజ్ఞానిని'**యని అంటున్నాడో,అతనిని యిట్లడుగవలెను.ఏమయ్యా!'నేను అజ్ఞానిని'యని యేదైతే నీవు చెబుతున్నావో,అది జ్ఞానమా?అజ్ఞానమా? అనగా,అజ్ఞానమును తెలిసికొని చెబుతున్నావా? లేక తెలియకనే చెబుతున్నావా? తెలియని విషయమును యెవరునూ చెప్పలేరు. అంటే, అజ్ఞానమును తెలిసికొనియే చెప్పుచున్నావు. అనగా,నీవు జ్ఞానము కలవాడవని (జ్ఞాన స్వరూపుడవని) అర్థతః సిద్ధమగుచున్నది.నీవు జ్ఞానస్వరూపుడవైయుండగా,నీయందజ్ఞానముండుట యెట్లు సంభవము?ఎందుకనగా, జ్ఞానాజ్ఞానములకు తమః ప్రకాశములకువలె సహఅనవస్థానరూప విరోధముగదా!సూర్యుని యందు చీకటియుండుట యెట్లు సంభవము? వ్యాఘాత దోషము (వదతః ఏవ విశేష ఆఘాతః=చెప్పువాని కే మిగుల దోషము) ప్రసక్తమగును.

**మమ ముఖే జిహ్వా నాస్తి, మాతా మే వంధ్యా ఆసీత్ ।**

**పితా మే బాల బ్రహ్మచారీ, అపుత్రస్య పితామహః ॥**

నా నోట్లో నాలుక లేదనుట, మా తల్లి గొడ్రాలని చెప్పుట, మా తండ్రి బాలబ్రహ్మచారియని మరియు మా తాతకు కొడుకులే లేరని చెప్పుట వ్యాఘాతమగును. కావున,'నేను అజ్ఞానిని'యని చెప్పుట భ్రాంతియేయగును. లేని అజ్ఞానమును నీయందారోపించుకొని చెప్పుచున్నావు, ఎట్లనగా!

**ఘనచ్ఛన్నదృష్టిర్ఘనచ్ఛన్నమర్కం, యథా నిష్ప్రభం మన్యతే చాతి మూఢః ।**

**తథా బద్ధవద్భాతి యో మూఢ దృష్టే స నిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥**

(హస్తామలకీయము)

ఉదాహరణకు:—ఒక చీకటిగదిలో ఒకానొక వస్తువును చూడాలని ఒక నిర్దుష్ట చక్షురింద్రియముగల పురుషుడు వెళ్ళినాడు.అతడు ఆ చీకటిగదిలోని వస్తువును చూడగలడా? చూడలే

డు. ఎందుకు? వెలుతురు లేదు గనుక. అనగా, నేత్రేంద్రియమునకు ప్రకాశముయొక్క అపేక్ష తప్పని సరియని తెలినది గదా! ఇక యిప్పుడు వినండి —

ఆకాశములో దేదీప్యమానముగా సూర్యుడు ప్రకాశించుచున్నాడు. ఇంతలో ఒక మేఘము సూర్యునికి అడ్డుగా వచ్చింది. అప్పుడు ఒకానొక బాలుడంటాడు -అహో! సూర్యుడు మేఘముచే కప్పబడినాడు(ఆచ్ఛాదింపబడినాడు) అని. ఇచ్చట కొంచెము ఆలోచించండి. ఆ బాలుడు మేఘమును చక్షురింద్రియముతో చూసియేగదా, సూర్యుడు కనబడుటలేదని చెప్పుచున్నాడు. నేత్రేంద్రియమునకు ప్రకాశముయొక్క అపేక్ష ఉంటుందని యిప్పడే తెలిసికొనివచ్చాము. ఇది సర్వానుభవ సిద్ధము.కావున,ప్రకాశము ఉంటేనే ఆ బాలుడు మేఘమును చూడగలిగాడు-అనునది నిర్వివాదము. అయితే,ఆబాలుడు యే ప్రకాశములో మేఘమును చూడగలిగాడు?సూర్యుని ప్రకాశములోనే గదా! మరి,సూర్యుడు ప్రకాశించుచుండగా, సూర్యుడు ఆచ్ఛాదింపబడినాడనుట ఎంతవరకు యోగ్యము? లేక,

ఆవరణము పెద్దదిగా నుండుట, మరియు ఆవృతము (కప్పబడునది) చిన్నదిగానుండుట లోకప్రసిద్ధము.ఉదా:—ఒక ఘటమును వస్త్రముచే కప్పి,పూర్తిగా కనబడకుండా చేసినచో, అక్కడ ఆవరణరూప వస్త్రము పెద్దదిగా,ఆవృతఘటము చిన్నదిగానుండుట ప్రత్యక్షసిద్ధము.కాని, సూర్యుడు యెన్నో కోట్లయోజనముల విస్తీర్ణముగలవాడని శాస్త్రము మరియు వైజ్ఞానికులుగూడ చెప్పుచున్నారు.అంతటి సువిశాల సూర్యుని ఒక చిన్నమేఘము యెట్లు ఆవరించగలదు?వాస్తవముగా మేఘము బాలుని దృష్టిని ఆవరించినది.కాని,సూర్యుడిని కాదు. సూర్యునియందు కేవలము అధ్యాసముచే ఆరోపించబడినది, **"అతస్మిన్ తద్బుద్ధిః అధ్యాసః"** అట్లు కానిదానియందు అట్లున్నదని చెప్పుట అధ్యాస యగును. కావున, సూర్యుడు ఆవరింపబడినాడనుట భ్రాంతియే యగును.

అట్లే,నీవు(జీవుడవు) స్వయంప్రకాశస్వరూపుడ(జ్ఞానస్వరూపుడ)వైయుండియు,'నేను అజ్ఞానిని'యని స్వీకరించి,దానిచే నేను బద్ధుడను,సంసారిని,దుఃఖిని,కర్తను,భోక్తను,మనుష్యుడను, బ్రాహ్మణుడను,బ్రహ్మచారిని,లావుగా ఉన్నాను,ఎర్రగా ఉన్నాను,కుంటివాడిని,గ్రుడ్డివాడిని,నేను జన్మించితిని,మరణించెదను,నాకు ఆకలేస్తుంది, దప్పిక కలుగుచున్నది-ఇత్యాద్యనేక అనాత్మ ధర్మములను నిర్ధర్మకచైతన్యము(నీ)యందు భ్రాంతిచేత ఆరోపించుకొనుచున్నావు.కాని, వాస్తవము గాదు.

ఆరోపించినంత మాత్రాన ఆరోపితవస్తువుయొక్క గుణదోషములచే అధిష్ఠానమగు ఆత్మచైతన్యమునకు యేమి హానియు కలుగనేరదు.**"యత్ర యదధ్యస్తః తత్కృతేన గుణేన దోషేణ వా**

**అణు మాత్రేణాఽపి స న సంబధ్యతే"**(అధ్యాసభాష్యము),"**నహ్యూషరభూమిం స్నేహేన పంకీకర్తుం శక్యతే మరీచ్యుదకమ్"** (గీతాభాష్యమ్ 13—౨)

**ఆరోపితం నాశ్రయ దూషకం భవేత్కదాపి మూఢైర్మతిదోష దూషితైః ।**

**నార్ద్రీకరోత్యూషర భూమిభాగం మరీచికా వారి మహాప్రవాహః ॥** (వి.చూ.4౭౨)

ఎండమావులందలి జలప్రవాహము ఊషరక్షేత్రమును తడుపజాలనట్లు, బుద్ధి దోషము గల మూఢులచేత కల్పింపబడిన ఆరోపితవస్తువు, అధిష్ఠాన వస్తువును దూషింపజాలదు.

కావున,ఓ సాధకులారా!పరమార్థత:ఆత్మకు అజ్ఞానమే లేదు.అలాంటప్పుడు, అజ్ఞానకార్యమగు దేహాదిక ప్రపంచముగాని,తజ్జన్యదుఃఖముగాని యెట్లు ప్రాప్తించును?అందువలన, మీరు శ్రోత్రియుడు,బ్రహ్మనిష్ఠుడు మరియు దయామయుడగు సద్గురువునాశ్రయించి, తగిన పరిచర్యలచే వారిని ప్రసన్నులను జేసికొని, వారియనుగ్రహమునకు పాత్రులై, వారి ముఖారవిందమునుండి,తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణముచేసి,మనన నిదిధ్యాసనములను గావించి, బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమును బడసి, నాయందు యీ మిథ్యాఽజ్ఞానము అత్యంతాభావమని తెలిసికొని, అంతర్ముఖ వృత్తిగలిగి, స్వస్వరూపానందమును పొంది జీవన్ముక్తులుగా విలసిల్లి, అంత్యమున పునరావృత్తిరహిత విదేహకైవల్యమును పొందుదురు గాక!

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మార్పణమస్తు

ఓం తత్సత్ ఓం



శిల్పి ఒక రాతిని తీసికొని ఉలిదెబ్బలు, సుత్తిదెబ్బలు కొట్టి విగ్రహమును తయారుజేయును. అట్లే, గురువు శిష్యుని క్రమశిక్షణ ద్వారా దృశ్యవృత్తులన్నింటిని తొలగించి ఆత్మజ్ఞానిగ జేయును. శిక్షలకు ఓర్వలేనివాడు అట్టి ఉన్నత స్థితిని పొందజాలడు.

నీళ్ళచే నిప్పును చల్లార్చునట్లు, శాంతముచే కోపమును జయించవలెను.

(శ్రీ మలయాళస్వాములవారు)



శ్రీ కృష్ణచరణానంద భారతీ స్వాముల వారు,
అ.ఆం.సా.పరిషత్ కోశాధికారి,
శ్రీ యాజ్ఞవల్క్య రాజాశ్రమ పీఠాధిపతులు,
ముండూరు-గ్రామము, పెదవేగి - మండలం,
ఏలూరు - జిల్లా, ఆంధ్రప్రదేశ్ - 534450

**ఓమ్ శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః**

అఖిల ఆంధ్ర సాధు పరిషత్ అధ్యక్షురాలు పూజ్య శ్రీపరావిద్యానందగిరి స్వామిని వారికి మరియు కార్యవర్గ, శాశ్వత సభ్యులకు ప్రణామములు తెలియజేస్తూ—ఓం నమో నారాయణాయ.

**బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం,**
**ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్ ।**
**ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం,**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం** (శ్రీ అభేదానన్ద యతీన్ద్రం) **తం నమామి.**

విశ్వ మానవాళి సన్మార్గంలో ప్రయాణిస్తూ లోకసంగ్రహణార్థం పాటుపడుతూ, అఖండ జ్ఞానమార్గంతో స్వస్వరూపాన్ని తెలుసుకుంటూ జీవన్ముక్తులవుతున్నారు అంటే కారణం శ్రీమద్భగవద్గీత. విశ్వమానవ జ్ఞాన, విజ్ఞాన ఆదరణ గ్రంథం శ్రీమద్భగవద్గీత. జగద్గురు శ్రీకృష్ణపరమాత్మ ముఖారవిందం నుండి నేరుగా వెలువడిన దివ్య జ్ఞాన గానమే శ్రీమద్భగవద్గీత. సాక్షాత్ పరబ్రహ్మ శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చిన ఒక్క శ్లోకాన్ని మననం చేసుకుందాం, విశ్లేషించుకుందాం, తరిద్దాం, తరింపచేద్దాము.

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।**
**సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥** (గీత.5-7)

భావం:—నిష్కామ కర్మను ఆచరించువాడును లెస్సగా జయింపబడిన మనస్సుగలవాడును, పరిశుద్ధమైన హృదయం కలవాడును, ఇంద్రియములను జయించినవాడును, సమస్త జీవరాశులయందు ఉన్న అత్మ, తన ఆత్మ ఒక్కటే అని తెలుసుకున్న మహాత్ముడైన మానవుడు కర్మలు చేసినను వానిచే అంటబడడు. కర్మలు చేయుచున్నను కర్మబంధముచే అంటబడక ఉండాలంటే ఐదు లక్షణములు కలిగి ఉండవలెను. నిష్కామ కర్మాచరణం, నిర్మల హృదయము,

మనోజయము, ఇంద్రియ జయము, సర్వత్ర ఏకాత్మ దర్శనము.ఈ ఐదు జ్ఞానియొక్క లక్షణములే.

కర్మలు సహజంగా బంధదాయకాలు.**"కర్మణా బధ్యతే జంతుః"**(సంన్యాసోపనిషత్ 2-117) అంటూ శాస్త్రం చెప్పినట్లు సదా కర్మలు ఆచరిస్తూ కర్మయోగి కర్మబంధాలకు అతీతుడై సర్వాత్మ జ్ఞాన సిద్ధిని పొంది, జ్ఞాన ప్రభావంతో కర్మలు చేస్తూ కర్మలకు అంటుకోకుండా ఉంటాడు. ఉదాహరణకు చేతికి నూనె రాసుకొని పనసకాయ వలిస్తే ఆ పాల జిడ్డు చేతికి అంటుకోదు. అదేవిధంగా ఫలాపేక్ష లేక కర్తవ్య దృష్టితో ఈశ్వరార్పణ బుద్ధితో చేసే కర్మ కర్మయోగమనబడుతుంది. అట్టి కర్మయోగాన్ని ఆచరిస్తూ కర్మయోగిగా యోగయుక్తుడవుతాడు. ఆ యోగప్రభావంతో విశుద్ధాత్ముడవుతాడు.విశుద్ధాత్ముడిలో ఆత్మ అనగా అంతఃకరణము,వాని అంతఃకరణము విశుద్ధమయినదని అర్థము. అనగా అంతరేంద్రియములు లెస్సగా జయించినవాడని అర్థము. అదే విధంగా బాహ్యేంద్రియములను జయించినవాడు విజితాత్ముడు. విజితాత్ముడిలో ఆత్మకు అర్థము దేహము. దేహాన్ని లెస్సగా జయించి స్వాధీనపరుచుకున్నవాడు జితేంద్రియుడవుతున్నాడు. ఈవిధంగా జడచేతనాత్మక సర్వభూతాల యొక్క ఆత్మయే తన ఆత్మగా ఉందని సార్వాత్మ్యభావాన్ని సాధించడం మానవ లక్ష్యము. ముక్కుపుడక, చెవిపోగులు, వడ్డాణం, కిరీటము మొదలగు భూషణాలకు బంగారమే వాస్తవ స్వరూపమైనట్లు, అహం పద లక్ష్యార్థమైన తన స్వరూపమే చరాచర సర్వభూతాలకు అధిష్ఠానస్వరూపమై ఉందనే విజ్ఞానం పొందిన కర్మయోగి మొదట చిత్తశుద్ధిని అనంతరం బాహ్యేంద్రియ నిగ్రహాన్ని ఆపై సర్వాత్మభావాన్ని పొంది ముక్తుడై, ఆ ముక్తదశలో ఇతరుల దృష్టికి కర్మలు చేసేవాడిలా కనబడినా ప్రారబ్ధక్షయార్థమో, లోకసంగ్రహార్థమో కర్మలు జరిగినప్పటికీ కర్తృత్వాభిమానము లేకపోవడంతో ఆ కర్మలు అతనిని బంధించలేవు. జీవన్ముక్తునికి స్వదృష్టిలో కర్తవ్యము లేదు.అతని కర్మలు కర్మలు కావు, కర్మాభాసాలు. కర్మలతో ఉండి కర్మలంటక కర్మాతీతుడై ఉండేవాడే బ్రహ్మజ్ఞాని.

బ్రహ్మమును యెఱిగినవాడే బ్రహ్మజ్ఞాని. ఒక్కటి అయి అఖండము, అసంగము, అజన్మము, అరూపమగు బ్రహ్మమునందు మూలాజ్ఞానము లేదు, తూలాజ్ఞానము లేదు, స్థూల సూక్ష్ములు లేవు, వ్యష్టిసమిష్టులు లేవు, సూత్ర విరాట్టులు లేరు, ప్రాజ్ఞ తైజస విశ్వులు లేరు, భోగము లేదు, యోగము లేదు,బంధము లేదు,మోక్షము లేదు,మరి యేమియును అణుమాత్రము లేదు.

**త్రిషుధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।**
**తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥** (కైవల్యోపనిషత్ 18)

**"మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః"** (మాం.కారికా.ఆగమ.ప్ర.17)

**న నిరోధో నచోత్పత్తిః న బద్ధో న చ సాధకః ।**

**న ముముక్షుర్నవై ముక్తః ఇత్యేషా పరమార్థతః ॥** (మాం.కారికా.వైతథ్య ప్ర.32)

కావున,స్వయంజ్యోతిః పరిపూర్ణమైన బ్రహ్మమునందు జాగ్రదాద్యవస్థలు మరియు వాటిలో ప్రతీయమానమగు ప్రపంచమంతయు బుద్ధివిలాసముగా (వినోదముగా)తోచుచున్నది. నిద్రాస్థానమందు తానొకడే యుండినను బాహ్యపదార్థాలు లేకయే స్వప్నమందు చిత్రవిచిత్ర పదార్థము లును(అర్థాధ్యాసము),వాటి జ్ఞానమునూ(జ్ఞానాధ్యాసము) ప్రతీతమగుచున్నవి. మరియు సుషుప్తియందోయనిన బాహ్యపదార్థమేమియు లేదు. అంతఃపదార్థమేమియు లేదు, ఇంద్రియసహిత బుద్ధియు లేదు. ఆత్మ ఏకరసముగా ఉండుటవలన బేధ భయాదులైన భిన్న పదార్థములు యేమియు లేవు,ఇట్లుండగా తదుత్తరమైన జాగ్రత్కాలమందు బుద్ధియును నానా పదార్థములును కనబడుచున్నవి. అవి ఏవి? అధ్యస్త వస్తువుయొక్క వాస్తవ స్వరూపము అధిష్ఠానమేయను నియమముచేత - బుద్ధి ప్రకాశకుడైన ఆత్మయే.

ఇట్లు, ఎవరికి ఆత్మానుభవ జ్ఞానము కలిగి అజ్ఞానాంధకారము నాశనమగునో, వానికి బాహ్యాంతర వ్యాపకమైనట్టి అసంగైక బ్రహ్మరూపానుభవ జ్ఞానమగును. వాడే జ్ఞానియగు జీవన్ముక్తుడు, స్థితప్రజ్ఞుడు.

ఈ విధంగా మానవులంతా నిష్కామ కర్మతో, యోగయుక్తులై, విశుద్ధాత్ములై, విజితేంద్రియులై, జితేంద్రియులై తన స్వస్వరూపాన్ని తెలుసుకొని, పరమ పదాన్ని పొంది, తాను తరిస్తూ తనతో పాటు సర్వులను తరింపచేసి, బ్రహ్మానందముతో నిత్యానందముతో మానవ జీవితం సార్థకము చేసుకొందురు గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః



విషము సోకిన వానికి స్మృతిపోవును. అట్లే విషయ సంసర్గము కలవానికి స్వబోధము నశించును. (శ్రీ మలయాళస్వాములవారు)



మాతా అనంతానందగిరి,
శ్రీ దత్తాత్రేయ మఠము, నెల్లూరు.

# భక్తి తత్త్వము

పరమాత్మస్వరూపులారా! తన ఇష్టదైవమును గూర్చి భక్తునికి మనసులో కలుగు అను రాగమే భక్తి. 'భజ సేవాయామ్' క్తిన్ ప్రత్యయము చేర్చినచో భక్తి అను శబ్దము ఉత్పన్నమైనది. నారద భక్తి సూత్రాలలో **"సాత్వస్మిన్ పరమప్రేమ రూపా"** అంటే భగవంతునియందు పరమప్రేమయే భక్తి. అదే భాహ్యావిషయాల మీద వుంటే ప్రేమ అమతుంది.శ్రీపండరీపురం భక్తులందరు సంసారవిషయాల మీదలేకుండ గోపికలలాగానే భగవంతుని మీద ప్రేమ కలిగివున్నారు. కర్మజ్ఞానముల కంటే భక్తి విశిష్టమైనది. అందుకని భగవంతుడు గీత మధ్యలో భక్తిషట్కము పెట్టినాడు. ఎందుకంటే భక్తిలేనటువంటి కర్మవ్యర్థము. 'భక్తిహీనం కథం జ్ఞానం' భక్తిలేని జ్ఞానము అహంకారముతోకూడివుంటుంది.అసలు భక్తి అంటే**"స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే"**(వి.చూ.32) ఎల్లప్పుడు స్వరూపజ్ఞానంతో వుండటమే భక్తి.

**భక్తిరేవ పరమార్థ దాయిని, భక్తిరేవ భవరోగ నాశిని ।**
**భక్తిరేవ పరవేదన ప్రదా, భక్తిరేవ పరమోక్షకారిణి ॥** (అనుభవసూత్రము 8-83)

అంటే భక్తియే పరమార్థమును ప్రసాదించును.భక్తియే సంసారవ్యాధిని నశింపచేయును. భక్తియే పరతత్త్వమును తెలియచేయును. భక్తియే మోక్షమునకు కారణమగుచున్నది.

**న తపోభిర్నవేదైశ్చ న జ్ఞానేనాపి కర్మణా ।**
**హరిర్హి సాధ్యతే భక్త్యా ప్రమాణం తత్ర గోపికాః॥** (పద్మపు. 6 ఉత్తరఖం.194-18)

తపస్సు చేతకాని, వేదాధ్యయనం చేతగాని,జ్ఞానం చేతకాని కర్మలచేతగాని సాధ్యము కాదు. భక్తిచేతనే పరమాత్మను పొందుట సాధ్యము. ఉదా:- గోపికలు.

**శుకాద్యాః సనకాద్యాశ్చ పురా ముక్తా హి భక్తితః ।**
**భక్త్యైవమామనుప్రాప్తా నారదాద్యాశ్చిరాయుషః॥**(గణేశపు.2 క్రీడాఖం.146-9)

శుకాదులు, సనకాదులు భక్తియోగము చేతనే ముక్తులైరి, నారదులు భక్తి చేతనే చిరంజీవులైరి. పరమాత్మను పొందుటకు భక్తియే సాధనము.

**మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరియసీ ।**
**స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే ॥** (వి.చూ.32)

మోక్షమును పొందుటకు భక్తియే గొప్పది.

**భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**

**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥** (గీత.11-54)

అనన్యభక్తి చేతనే యథార్థముగా తెలిసికొనుటకు గాని, దర్శించుటకు గాని, ప్రవేశించుటకు గాని సాధ్యమగుచున్నది."**న మే భక్తః ప్రణశ్యతి**"(గీత.9-31) నా భక్తులు ఎప్పుడూ నశించరు.

**సర్వధర్మాన్పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ ।**

**అహం త్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి మా శుచః ॥** (గీత.18-66)

అన్ని ధర్మములను వదిలి భగవంతుడినే శరణు బొందినవారిని అన్ని పాపములనుండి విముక్తిజేసి మోక్షమును ప్రసాదిస్తానని భగవంతుడు చెప్పియున్నాడు. చింతింపవలదు.

**అనన్యాశ్చింతయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**

**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥** (గీత.9-22)

ఎవరు అనన్యభక్తితో యితర చింతలు లేకుండ నన్ను ఉపాసిస్తారో, వారి యోగం అంటే కావలసినవన్నీ ఇస్తాను. క్షేమం అంటే ఇచ్చినవి రక్షిస్తానని చెప్పియున్నాడు.

**విషయాన్ధ్యాయతః చిత్తం విషయేషు విషజ్యతే ।**

**మామనుస్మరతః చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥** (ఉద్ధవ గీత.11-27)

ఎవని మనస్సు విషయములను ధ్యానిస్తుందో, అదే విషయమును పొందుతుంది. భగవంతుని ధ్యానించే మనస్సు భగవంతునిలో లయమవుతుంది. భగవంతుని భక్తితో ఆరాధించుటకు మూడు ఉపాసనలు కలవు. ప్రతీకోపాసన, సగుణోపాసన, నిర్గుణోపాసన. ప్రతీకోపాసన అంటే —

**శైలీ దారుమయీ లౌహీ లేఖ్యా లేప్యా చ సైకతీ ।**

**మనోమయీ మణిమయీ ప్రతిమాష్టవిధా స్మృతాః ॥** (ఉద్ధవ గీత.22-12)

భగవంతుని ప్రతిమలు యెనిమిది విధములుగా చెప్పబడినవి. రాతిమయములు, దారుమయములు,లోహనిర్మితములు, చిత్రపటరూపములు, దర్పణరూములు, ఇసుకమయములు, మనోమయములు, మణిమయములు. వ్యక్తమగు పరమాత్మను పూజింపక, అవ్యక్తమగు పరమాత్మను దర్శించుటకు అలవికాదు.

**నిర్విశేషం పరంబ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః ।**

**యే మన్దాస్తేఽనుకమ్ప్యన్తే సవిశేష నిరూపణైః ॥**

**వశీకృతే మనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్ ।**

**తదేవావిర్భవేత్సాక్షాదపేతోపాధి కల్పనమ్ ॥** (బ్ర.సూ. వేదాన్తకల్పతరు 1-1-20)

**చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్యాశరీరిణః ।**

**ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా ॥** (రామపూర్వతాపనీయోపనిషత్ 1-7)

శబ్దబ్రహ్మము అంతటనున్నప్పటికి 'రేడియో' అను ఉపాధిచే ఆకర్షింపబడి వినిపించునట్లు, తల్లిపాలు శరీరమంతట వున్నప్పటికీ, స్తనమునుండి బిడ్డకు లభించునట్లు, పరమాత్మ సర్వవ్యాపకమైనప్పటికిని విగ్రహరూపములనుండి శక్తి ప్రసారమవుతుంది.

ఎట్లు స్థూలదేహమున వాత, పిత్త మరియు కఫములను మూడు దోషములుండునో, అట్లే సూక్ష్మశరీరము (అంతఃకరణము)లో మల, విక్షేప, ఆవరణ దోషములు మూడువున్నవి. మలం అనగా పాపము. తన్నివృత్తికై ప్రతీకోపాసన చేయాలి, విక్షేపదోషం పోవాలంటే సగుణోపాసన ద్వారా భగవంతుని తీవ్ర ధ్యాన, జపాదులతో ఉపాసించిన విక్షేపం అనగా చంచలత్వము పోతుంది. ఆవరణదోషము నిర్గుణోపాసన ద్వారా **"సత్వాత్సఞ్జాయతే జ్ఞానమ్"**(గీత.14-17) అన్నట్లు, అజ్ఞానావరణదోషం పోయి జ్ఞానం కలుగుతుంది.

**కర్మాణి చిత్తశుద్ధ్యర్థం హ్యైకాగ్ర్యార్థముపాసనా ।**

**మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానమితి వేదాన్త డిణ్డిమః॥** 26 ॥

అని శ్రీశంకరులు చెప్పినట్లుగా కర్మల వలన చిత్తశుద్ధి, ఉపాసనవలన చిత్తయేకాగ్రత, బ్రహ్మజ్ఞానంవలన మోక్షము. ప్రహ్లాదుడు, ధ్రువుడు శంఖచక్రగదాధరుడైన సగుణస్వరూపాన్ని ధ్యానించి **'సర్వం విష్ణుమయం జగత్'** అంతటా శ్రీమహావిష్ణువునే చూశారు. భక్తియొక్క పరాకాష్టయే సర్వాత్మజ్ఞానము.

సత్కర్మనిష్ఠులై, భగవద్భక్తులై, ఆత్మవిజ్ఞాన సంపన్నులై బ్రహ్మానందముతో విరాజిల్లే శక్తిని పరమాత్మ, సద్గురువులు ప్రసాదించుదురు గాక!

ఓం తత్సత్ ఓం

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు





మాతా పరబ్రహ్మానందగిరి, శ్రీ సద్గురు గీతాశ్రమము,
అ.ఆం.సా.పరిషత్ కార్యవర్గ సభ్యులు,
నల్లమిల్లి,అమలాపురం-మండలము,కోనసీమ జిల్లా.
Cell: 6304588863

## మానవుడుత్కృష్టుడేనా?

**ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యో,**
**వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥**

అఖిలాంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు పూజ్య శ్రీశ్రీశ్రీ పరావిద్యానందగిరి మాతాజీ వారికి, మరియు వేదికస్థ స్వామిజీలకు, మాతాజీలకు నమస్కరిస్తూ, క్షేత్రాధిష్ఠాన దైవమయిన శ్రీ రుక్మిణీ సమేత పాండురంగస్వామికి, గురుపరంపర స్వామీజీలకు వందనములు సమర్పించుకుంటూ 58 వ మహాసభలు పుణ్యక్షేత్రమైన శ్రీపంఢరీపురంలో జరుగుట విశేషము.

మానవుడు ఏవిధంగా ఉత్కృష్టుడో అను విషయాన్ని భగవంతుడు పలికించినట్లు నాలుగు మాటలు పలుకుటకు ప్రయత్నం చేస్తాను.

**దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహ హేతుకమ్ ।**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥** (వి.చూ.3)

అని శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు వివేక చూడామణిలోను మరియు ఇదే భావమును శ్రీమద్భాగవతంలో కూడ తెలియపరచినారు.

**దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభఙ్గురః ।**
**తత్రాపి దుర్లభం మన్యే వైకుణ్ఠ ప్రియదర్శనమ్ ॥** (శ్రీమద్భాగవతము 11-2-29)

మనుష్యత్వం లభించటం దుర్లభమని, మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనదని, పరమ శాంతిని, శాశ్వతానందాన్ని పొందుటకు మానవ జన్మే అధికారి జన్మయని మహాత్ములంతా కూడ చెబుతూనే ఉన్నారు. కాని,అలాంటి ఉత్కృష్ట మానవ జన్మ, క్రిందకు దిగజారి పశుప్రాయమై పోయినది. ఏరంగములో చూచినా మానవుడు శాంతిగా లేడు. మతాన్ని గురించి విచారించండి. సామాన్యంగా మతం ఎప్పుడూ శాంతి సామరస్యాలను సాధించి పెట్టాలనే చూస్తుంది. కాని, ఆచరణలో కొచ్చేటప్పటికి భిన్నమతాల మధ్య శాంతి సామరస్యాలను నెలకొల్పుటకు బదులుగా-మతకలహాలనే రెచ్చగొడుతుంది. ఆర్థికంగా చూస్తే వెనుకబడిన, దేశాల్లో ఆర్థిక భద్రత లేక దరిద్రంతో బాధపడుతున్నారు. ఐశ్వర్యవంతమైన అభివృద్ధి దేశాల్లో ప్రాణులకే భద్రత

లేకుండా పోయింది. సరే, రాజకీయాల్లో చూద్దామా! నిత్యం పోరాటమే. ఇవన్ని విచారించి చూస్తుంటే, నేటి మానవుడు స్వార్ధపరుడై అజ్ఞానంతో పశువుకంటే క్రిందికి జారిపోయాడు. ఇలా మనుష్యుడు యెందుకు పతనోన్ముఖుడౌతున్నాడు? తానెవరో తాను తెలిసికోలేని అజ్ఞానం వల్ల. స్వస్వరూప జ్ఞానం లేకపోవడం వల్ల. జ్ఞానం లేకపోతే .......

**ఆహార నిద్రా భయ మైథునంచ, సామాన్యమేతత్పశుభిర్నరాణామ్ ।**

**జ్ఞానం హి తేషామధికో విశేషో, జ్ఞానేనహీనః పశుభిః సమానః ॥**

అని శాస్త్రం చెప్తుంది.ఈ విషయం మహాత్ములు ఒక చక్కని దృష్టాంతముతో స్పష్టం చేస్తారు.

ఒక అరణ్యప్రాంతంలో ప్రశాంత వాతావరణంలో మహత్ములంతాజేరి భాగవత సప్తాహం జరుపుకుంటున్నారట. మానవజన్మ అన్ని జన్మలలోను ఉత్కృష్టమైందని ప్రతిరోజు సత్సంగంలో చెప్పుకుంటూ ఉంటుంటే-జంతువులు, పక్షులు ప్రతిరోజు తిరుగుతూ వింటూన్నవి. వాటికి ఈర్ష్య, సందేహం కలగటమే కాకుండా, మానవజాతియందు అసహ్యాభావం కూడ కలిగింది. ఒక రోజున చిన్నచిన్న జంతువుల నన్నిటిని సమావేశ పరచి, నక్క చెబుతుంది. మానవుని ఆచరణ, మన ఆచరణ పోల్చి చూస్తే సమానంగానే వుంది. ఆహారం, నిద్ర, భయం, మోసం, కపటం అన్నీ సమానంగానే ఉన్నవి. అయినప్పటికీ మనకంటే మనుష్యుడు శ్రేష్టుడని ఎలా నిర్ణయించారు? ఇది చాలా అన్యాయం. ఏమైనా సరే, ఈ విషయాన్ని తేల్చుకోవలసినదే.

ఇదివిని జంతువులన్ని ఏకమతంగా ఒప్పుకున్నవి.కాని,ఒక వృద్ధ వానరము లేచి యిలా అంది. అవును, నక్కబావగారు చెప్పినది సత్యమే. మానవజాతి మీద విప్లవం లేవాలంటే, పెద్ద జంతువుల సహకారం కూడ కావలసియున్నది.అందుచేత అన్ని జంతువులలోను పెద్ద జంతువు ఏనుగును కలుపు కోవాలి—అని జంతువులన్ని ఏనుగు వద్దకు వెళ్ళాయి. ఏనుగుతో ఈ విషయమంతా చెప్పాయి. ఏనుగు అంటుంది. మీకు కలిగిన సందేహం కొంతమేరకు సరైనదే. మనమందరం కలిసి మెలసి పని చెయ్యాలి, కాని, మనం యింకా యితరుల సహాయం కూడ పొందాలి. ఈ అరణ్యంలో రెండు కాళ్ళ వారుగాని, నాలుగు కాళ్ళవారుగాని ఎవరున్నా మన సోదరులే.ఇచ్చట సమీపంలో ఒక సాధువుగారున్నారు.వారి సలహాకూడ తీసుకోవాలి. మనతో పాటు అరణ్యంలో ఉంటున్నారు.అందులో మానవుడు.సరేనని, అందరూ సాధువుగారి వద్దకు వెళ్ళారు.

కుక్క మొరుగుతూ—సాధువుగారితో అంటుంది.స్వామిజీ!నన్ను మీరెరుగుదురు కదా? నేను కృతజ్ఞతకు ప్రతిరూపాన్ని. నా ప్రాణాన్ని కోల్పోయినాసరే యజమానిని కాపాడతాను.

కాని, నేడు మానవుడు ఎంతో సహకారం పొందికూడా తన స్వార్థంకోసం స్వజనులను హత్యచేసేటంత క్రిందికి దిగజారి పోయాడు.మా అందరికంటే మానవుడు గొప్పవాడెలా అయినాడో, చెప్పండి స్వామీజీ!యింతలోనే గోమాత రంకెవేస్తూ ముందుకువచ్చి అంటుంది. స్వామీజీ! నేను మూడులోకాల్లో మాతృస్థానాన్ని అలంకరించి గౌరవింపబడుతూన్న సంగతి మీకు బాగుగా తెలుసు. నా మలమూత్రాలుకూడా పరమపవిత్రమైనవిగా భావించబడుతున్నవి. అమృతతుల్యమైన పాలు అందరికి అందిస్తున్నాను. లౌకికమైన పారలౌకికమైన అన్నివిధాల లాభం పొందుతూ, మానవుడు నాకు తృప్తిగా తినుటకు ఎండుగడ్డైనా వేయడు. నాబిడ్డలకు సరిపోను పాలు విడిచిపెట్టడు. నా బిడ్డలతో పొలం దున్నించుకుంటాడు.కాని,నేను నా బిడ్డలు పనిచెయ్యలేకపోతే, కసాయి వానికి అమ్మేస్తాడు. స్వామిజీ! యిదేనా మానవత? అలాంటివారిని రాత్రింబగళ్ళు ప్రశంసలు పొగడ్తలు చేస్తున్నారు.స్వామీజీ!యిలాంటి చేసిన మేలుమరచే (కృతఘ్నుడగు) మానవుని సర్వశ్రేష్ఠప్రాణిగా ఎలా చెప్పుకుంటున్నారు?

పాపం!ఆ సాధువుగారు మౌనందాల్చి వింటూనే ఉన్నారు. యింతలో కాకి లేచి అం-టుంది. స్వామీజీ!నా ఒక్క ప్రశ్నకు జవాబివ్వండి. మాలోవున్న ఒక్క గుణమైనా మానవజాతిలో ఉందేమో చెప్పండి. స్వామీజీ!ఒక చిన్న రొట్టెముక్కను నేను చూడగానే 'కావు కావు'మని నా స్నేహితులను స్వజనులను పిలిచి అందరము పంచుకొని తింటాము. కాని,మానవుడు పరమలోభి, అసంతుష్ట ప్రాణి. ఐశ్వర్యవంతుడైకూడ యితరుల ధనాన్ని కాజేయాలని చూస్తాడు. అలాంటి లోభియగు స్వార్థమానవుని మాకంటే గొప్పవాడని ఎలా చెప్తారు స్వామీజీ? స్వామీజీ మౌనంతోనే అన్నీ వింటున్నారు.

ఇంతలో చేప లేచి అంటుంది - మహారాజ్! మనుష్యుడు నాకంటె నీచుడు, పరమస్వార్థపరుడు కదా! నేనెప్పుడూ అతనికి కష్టం కలుగజేయను. పైగా వాళ్ళ చెరువుల్లోనూ, సరస్సులలోను నీటిని శుద్ధంగాను, నిర్మలంగాను ఉంచుతాను. ఏలాంటి మురికిని పారేసినా తిని శుద్ధం చేస్తాను. ఇంత ఉపకారంచేస్తున్నా మానవుడు రక్షకుడుగా కాక, భక్షకుడౌతున్నాడు. అలాంటి మూర్ఖమానవుని మాకంటే గొప్పవాడని అనడం ఎంత న్యాయం?

తరువాత, గ్రధ్ధ ముందుకువచ్చి మాట్లాడుతుంది.నా దృష్టిలాంటి దృష్టి మానవుని కుందా? అని. తదుపరి, గాడిద మాట్లాడుతూ—స్వామిజీ! నేను యెంతటి బరువువైననూ సహనంతో మోస్తాను. మరియు, ఒంటె అంటుంది- ఎడారులలో మండుటెండల్లో కాలే యిసుకపై మోయలేనంత బరువులు నాపై మోపి, అదేపనిగా నన్ను కొడతారు. కొండజాతులవారు నన్ను చూస్తేసరి చంపి తినేస్తారు. అయ్యో!ఎంతటి అన్యాయం! లేడి అంటుంది. సంతు మహాత్మా!

మీరు కూర్చొని ధ్యానసాధన చేసుకుంటారే! ఆ ఆసనం మా జాతివారి చర్మమే. మానవుని చర్మము ఎందుకైనా పనికొస్తుందా స్వామీజీ! మాకండ్లను అతి సౌందర్యవంతుల కండ్లకు సాదృశ్యం చెప్పిఉపమానంగా చూపుతారు. కాని, నిర్దయుడగు మానవుడు మమ్ములను తినే స్తున్నాడు. సత్యం సత్యం అంటూ నెమలి లేచి అంటుంది.ఆకర్షణీయమైన నా యీకలను భగ వంతుడైన కృష్ణుడు తన శిరస్సున ధరించుకున్నాడు. కార్తికేయుడు నన్నే వాహనముగా గ్రహించాడు. నా యీకలు తాకితేనే భూతాలు పారిపోతాయి. మానవుడెలా గొప్పవాడయ్యా డు స్వామీజీ? మరియు, పిల్లి అడిగిందట—రాత్రిగాని పగలుగాని నేను చూడగలిగినట్లు ఎవరు చూడగలరని.

ఈ విధంగా జంతువులన్ని ప్రశ్నల వర్షం కురిపించాయి. తరువాత ఏనుగు ముందు కు రాగానే చిన్న జంతువులన్ని వెనక్కి తగ్గాయి. ఏనుగు గంభీరంగా నిలబడి స్వామిజీని అడి గింది. స్వామీజీ!నా బలాన్ని బుద్ధిని అందరు ప్రశంశిస్తారు.నా దంతాల విలువ ఎరుగని వారె వరు? కాని, మానవుడు ఎందుకు గొప్పవాడనిపించు కుంటున్నాడు? ఏదో ఒక విశేష కారణముండి తీరాలి. దయచేసి తెలియజెప్పండి మహాత్మా?

అరణ్య పశుపక్ష్యాదులయొక్క ఆవేదనను శాంతమనస్కుడై విన్న స్వామిజీ సమాధాన మిస్తూ — ఓ అరణ్యస్వజన బృందమా! మీరు చెప్పినది సత్యమే, యథార్థమే. కాని, మనుష్యు నికి భగవంతుడు ఆరవ యింద్రియాన్ని ప్రసాదించాడు. అది మీకెవరికి లేదు. అదే వివేకబుద్ధి. అందువల్లనే మానవుడు విశిష్టుడు, శ్రేష్ఠుడు. మంచి చెడు, ధర్మం అధర్మం, కర్మ అకర్మముల ను వివేచన చేయగలడు. తన యింద్రియాలను నిగ్రహించి మానవుడు అపరోక్షానుభూతి ద్వా రా ఈశ్వర సాక్షాత్కారం పొందగలడు. కాబట్టే, సమస్త ప్రాణులలోను మానవుడు శ్రేష్ఠుడని చెప్పబడుచున్నాడు.

అప్పుడు జంతువులడిగాయి—ఒకవేళ మానవుడు ఈశ్వర సాక్షాత్కారం పొందలేకపో తే? పొందకపోతే పశువు కంటే నీచుడేనని స్వామిజీ చెప్పారు. ఈశ్వర సాక్షాత్కారం పొంది నట్లైతే అతడు మహాత్ముడే, పరమాత్మయే యగును.

**బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి ।** (ముండకోపనిషత్ ౩-౨-౯)

**జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ ।** (గీత ౭-18)

ఆ అధికారం ఒక్క మానవునికే ఉంది. పశుపక్ష్యాదులకు లేదు. ఎంత ప్రయత్నించినా రాదు. సర్వప్రయత్నములచే గూడ సింహము తన క్రూరస్వభావమును మాని సంస్కరించుకో లేదు.

**భినత్తు భీమం కరిరాజకుమ్భం, తనోతు వేగం పవనాదతీవ ।**

**కరోతు వాసం గిరిగహ్వరేషు, తథాపి సింహః పశురేవ నాన్యః ॥**

కాని, "**పశ్యన్తీతి పశవః=జీవాః**" శబ్దాది విషయములందాసక్త చిత్తుడగు పశుస్వభావం గల మానవుడు జ్ఞానసాధనలనవలంబించి తీవ్రతర ప్రయత్నముచేసి, స్వభావాన్ని పరిత్యజించి '**పశుపతి**' కాగలడు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుల సాంగత్యంలో వారి సేవా(శుశ్రూషల)ద్వారా బ్ర హ్మవిద్యను ఆర్జించినచో మానవుడు ఉత్కృష్టుడు కాగలడు.ఎనభైనాలుగు లక్షల నీచజన్మలెత్తి యెత్తి చివరకు-ఈశ్వరానుగ్రహముచే యీ ఉత్కృష్టమైన మానవజన్మనెత్తే అవకాశం లభించి నది.

**కుక్కనక్కల యందునా నే బహు పెక్కు జీవుల యందునా ।**

**అక్కటా! పుట్టుగిట్టి యీ జన్మ మెత్తితిని రామ రామ ॥**

**ఈ జన్మ యందైననూ నీ సేవ నే జేయక యుండినా ।**

**నిక్కముగ ముందు వలెనే బహుజన్మ సంభవము రామ రామ ॥**

కావున, ఓ మానవుడా! నీయొక్క స్వతస్సిద్ధ స్వస్వరూపమును(పరమాత్మను) నీవు గుర్తించకపోతే అధః పతనమై పోతావు. మళ్ళీ నీకు మనుష్యుడుగా పుట్టగతులుండవు. అజ్ఞాన జీవితం పశుజీవితమని పైదృష్టాంతము ద్వారా తెలుసుకున్నావు గదా! కాబట్టి, నీ జన్మహక్కైన '**బ్రహ్మవిద్య**' నార్జించి విశిష్టుడవు కమ్ము. అట్టి శక్తిని మనకు గీతాచార్యుడు ప్రసాదించు గాక!

విద్యాతపోభ్యాం పూతాత్మా వర్ధతామ్ ।

బ్రహ్మవిద్యాచ లోకేభ్యః సుఖమేధతామ్ ॥

॥ ఓం శాంతిః శాంతిః శాంతిః ॥



ఒకరు నడిచి పోవునపుడు వారి నీడను ఎవరు ఆపలేరు. అట్లే, దైవము ఒకరి కొఱకు ఏర్పరచియుండు భాగ్యము ఎవరిచేతను అపహరింప తరము గాదు.

(శ్రీ మలయాళస్వాములవారు)



శ్రీ సర్వేశ్వరానన్ద స్వాములవారు,
శ్రీ లలితాంబికా తపోవనం,ద్వారం సంఖ్య: 7-91,
శ్రీ మాతా తపోయజ్ఞ స్థలి, జనవాడ, శంకరపల్లి
రోడ్డు, రంగారెడ్డి - జిల్లా, హైదరాబాదు,
తెలంగాణ. 500075 ; Cell: 9573955275.

**ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో ।**
**వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥**
**యుక్తాహార విహారాయ వివిక్త స్థలవాసినే ।**
**మలయాళ యతీంద్రాయ బ్రహ్మనిష్ఠాయ తే నమః ॥**
**పంచాశత్ వర్ణరూపేణ యయా వ్యాప్తమిదం జగత్ ।**
**శబ్దబ్రహ్మ మయీం వాణీం భజేహం పరదేవతా ॥**
**అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్ ।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥**
**అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥**
**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥**

అఖిలాంధ్ర సాధు పరిషత్ యొక్క 58 వ సభ పవిత్ర తీర్థక్షేత్రమైన పంఢరీపురంలో రుక్మిణీ పాండురంగ-విఠలుని దివ్యసన్నిధిలో,వారి ఆశీస్సులతో నిర్వహిస్తున్న పరమాధ్యక్షురా లగు పరమపూజ్య మాతాజీ శ్రీపరావిద్యానందగిరి వారికి, ఈసభాధ్యక్షురాలైన పూజ్య మాతా శివచైతన్యానంద సరస్వతి వారికి, వేదికస్థ మహాత్ములు (స్వామీజీలు, మాతాజీలు) సభాస్థలి లో ఆసీనులైన మహాత్ములు, భక్తబృందము, అందరి హృదయస్థ చైతన్యస్వరూపుడైన పరమాత్మ కు ప్రణామాలర్పిస్తూ— దివ్యాత్మ స్వరూపులారా !

ముందుగా మధురమైన పాండురంగ విఠలుని దివ్యనామ సంకీర్తన చేస్తూ మీ అందరికీ నా నివేదన—సనాతన ధర్మములో శ్రుతులు అంటే వేదములు ప్రధానమైనవి. ఇవి కర్మకాండ, ఉపాసన (భక్తి)కాండ, జ్ఞానకాండ అని మూడు విధానాలు సూచిస్తాయి. ఏది ఎవరు ఆచరిం చాలి అనేది ఆ వ్యక్తియొక్క అధికారమును బట్టి ఉంటుంది. ఇది గుణప్రధానము. అలాగే సర్వో

పనిషత్సారమైన భగవద్గీతకూడ కాండత్రయము. మొదటి ఆరు అధ్యాయములు ప్రథమ షట్కము కర్మకాండ, తరువాతి ఆరు అధ్యాయములు(7 నుండి 12 వఱకు)భక్తికాండ ద్వితీయ షట్కము. మిగిలిన ఆరు అధ్యాయములు (13 నుండి 18 వఱకు) తృతీయ షట్కము జ్ఞానకాండ.

మన వ్యవస్థలో చతురాశ్రమములున్నాయి. వరుసగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సంన్యాస ఆశ్రమములు. ఉత్తరోత్తరముగా పై స్థాయిని సూచిస్తాయి. ప్రతి ఆశ్రమములోను ఆచరించవలసిన విధి విధానాలు విపులంగా మన శాస్త్రములలో తెలుపబడి ఉన్నాయి.

ఒకనాడు వ్యవస్థలో ఇవి చక్కగా ఆచరించబడి, సమాజము శాంతియుతముగా పరస్పర సహకారముతో ఉండెను. ఉదా:-బ్రహ్మచర్య ఆశ్రమము.(ఈనాటి విద్యార్థి-దశతో పోల్చవచ్చు). ఇందు బ్రహ్మచారి గురుకులవాసము చేస్తూ నియమ నిష్ఠలతో గురు శుశ్రూష చేస్తూ అధ్యయనము ప్రధానముగా ఉండేవారు.ఈనాటి కాలపరిస్థితులలో ఈ గురుకులవ్యవస్థ దాదాపు కనుమరుగయింది. ఆనాటి కాలములో విద్యయే ప్రధానము, ధనము ఇతర వ్యవహారములు అప్రధానము. ఇలాగే మిగిలిన ఆశ్రమ పద్ధతులు కూడా ఉండేవి.

ఉదా:- గురుకుల వ్యవస్థలో విద్యార్థులు గురుశుశ్రూష చేసి కఠిన శిక్షణను పొంది తిరిగివచ్చి సమాజమునకు తమ విద్యద్వారా మార్గదర్శనము చేసేవారు. ఈ నాటి విద్యావ్యవస్థలో ఇటువంటి శిక్షణ లేదనుట అతిశయోక్తి కాదేమో!

ఏవిధంగా శిల ఉలిదెబ్బలు తిని తట్టుకొని శిల్పముగా మారుతుందో, అలాగే విద్యార్థి కూడా గురుకులవాస శిక్షణలో రాటుతేలేవాడు. దీనిద్వారా ఉత్తర ఆశ్రమములో వ్యక్తి ఎటువంటి కర్మలను ఆచరించాలి. ఎలా జీవించాలి అనేది విద్యార్థి దశలోనే నేర్చుకొనేవారు.ఈ విధి విధానాలను తు.చ. తప్పక పాటించి కర్మనిష్ఠులుగా ఉండేవారు.ఈ కర్మలనే నిష్కామముగా ఆచరించెడివారు. **"కర్మణా జాయతే భక్తిః"** - అన్నట్లుగా భక్తి, ఉపాసనలో ప్రవేశించేవారు.

శ్రీమద్భాగవతము ప్రకారము ఈ భక్తి నవవిధములు శ్రవణము,కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము,వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।**
**అర్చనం వన్దనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥** (శ్రీమద్భాగవతము 7-5-23)

ఒక్కొక్క విధానములో ఒక్కొక్కరు తరించిన గాధలున్నాయి.

**విష్ణోస్తు శ్రవణే పరీక్షిదభవద్వైయాసికిః కీర్తనే,**
**ప్రహ్లాదః స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీః పృథుః పూజనే ।**

**న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానుశుః ।** ( కైవల్యో.1-3)

అట్టి బ్రహ్మతత్త్వజ్ఞానమును — శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడునగు సద్గురువునకు శరణు వెళ్ళి, యథోచిత పరిచర్యలచే అతనిని ప్రసన్నుని జేసుకొని, ఆయనయొక్క కృపకు పాత్రులమై, శ్రీగురుదేవునియొక్క ముఖారవిందమునుండి తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణము, మననము మరియు నిదిధ్యాసనరూప విచారము ద్వారా పొందవలసియున్నది.

కావున,సాధకునకు సద్గురు సాన్నిధ్యము అత్యంతావశ్యకమై యున్నది.దానితో యీ దేహాదిక ప్రపంచము తాత్కాలికమైనదని,మిథ్యయని, మనము చేరవలసిన నిత్యమైన, శాశ్వతమైన గమ్యము వేరే వున్నదన్న సత్యం బోధపడుతుంది. ఆ సత్య జ్ఞానముతో నీవు మోక్ష తీరాన్ని చేరవచ్చు. సద్గురువు ఎటువంటి వాడు-అంటే, తాను స్వస్వరూపానుభూతిని బడసి, పరమశాంతిని పొంది, సకల సంసార బంధములనుండి ముక్తినొంది, ఇతరులను సైతం ఐహిక పారలౌకిక ఆనందాలు, వైభోగాలు, సంసార బంధములనుండి విమోచన చేస్తాడు. అందులకే, శ్రీగురుదేవుడు అహైతుక దయాసింధువనబడుచున్నాడు.

**"గురుః సాక్షాత్ పరబ్రహ్మ"**

ఈ శరీరరూప సంఘాతము యొక్క మనుగడకు ప్రధాన సాధనము మనస్సు. అది నిరంతరము సంకల్ప వికల్పములు చేస్తూ ఉంటుంది. అయితే మనస్సు ఆలోచించిన దాన్ని చేయాలా వద్దా? అని నిర్ణయించేది మాత్రము బుద్ధియే. కనుకనే, మనము యేదైనా మంచి పనిచేస్తే బుద్ధికలిగిన వారిగా లోకము మనలను ప్రశంసిస్తుంది.అయితే ఈ మనోబుద్ధులకు సాక్షియై, గమనిస్తూ వుండేది ఆత్మ (మన స్వరూపము).

కావున, నశ్వరమైన ఈ శరీరము అదర్శనము కాకపూర్వమే, శ్రీగురుదేవుల శ్రీచరణ కమలములనాశ్రయించి, గురువుపై భక్తి ప్రపత్తులతో సేవచేసి, వారియనుగ్రహమునకు పాత్రులమై, జ్ఞానమును సముపార్జన చేసి అఖండజ్ఞానమును, కీర్తిని పొంది తరించుదుము గాక!

శుభమస్తు...





శ్రీశివానంద స్వామిగారు,సంస్థాపకాశ్రమాధిపతులు,
సద్గురు శ్రీనిత్యశుద్ధానందస్వామి క్షేత్రం,శ్రీరామదూత ఆశ్రమము, ఆమనగల్లు, జి.రంగారెడ్డి.

సర్వవ్యాపక పరమాత్మకు నమస్కరిస్తూ........

58 వ అఖిల ఆంధ్ర సాధుపరిషత్ మహాసభలు మహారాష్ట్రంలోని పంఢరీపురంలో జరుగుచున్నప్పుడు ఇతర సభాకార్యక్రమములవలన రాలేకపోయినందులకు చింతించుచున్నాను. పరిషదధ్యక్షులైన మాతా పరావిద్యానందగిరి వారి అధ్వర్యములో సోలాపూర్ భక్తుల సహకారముతో కార్యక్రమము దివ్యంగా జరిగినదని తెలిసి ఆనందించాను. కార్యక్రమములో పాల్గొనలేకపోయిననూ సంచికలో వ్యాసము వ్రాయుటకు అవకాశమిచ్చిన మాతాజీ వారికి నమస్కరిస్తూ.... మహాత్ముల పాదపద్మములకు ప్రణమిల్లుచున్నాను.

## శ్రద్ధ అనగా ఏమి?

ఆత్మీయులారా! మనిషి ఏ రంగంలో రాణించాలన్న శ్రద్ధ ఎంతేని అవసరము. శ్రద్ధను గూర్చి జగద్గురు శ్రీఆదిశంకరాచార్యులవారు చెప్పిన నిర్వచనం వివేకచూడామణిలో ——

**శాస్త్రస్య గురువాక్యస్య సత్య బుద్ధ్యావధారణా ।**

**సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే ॥** (వి.చూ.26)

శాస్త్ర వాక్యములు మరియు శ్రీగురుదేవుల వాక్యములు సత్యమనెడి నిశ్చయబుద్ధితో నమ్మియుండుట **'శ్రద్ధ'**యనబడును. అట్టి శ్రద్ధవలన అద్వయానందప్రత్యగ్బోధస్వరూపాత్మ ఉపలభ్యమగును(పొందబడును)అనగా'అహం బ్రహ్మాస్మి'యను నిశ్చయజ్ఞానము కలుగును.

**శ్రద్ధాం ప్రాతర్హవామహే శ్రద్ధాం మధ్యందినం పరి ।**

**శ్రద్ధాం సూర్యస్య నిమృచి శ్రద్ధే శ్రద్ధాపయేహ నః ॥** (ఋగ్వేదము.10-151-5)

ప్రాతఃకాలమునందు, మధ్యాహ్నకాలమునందు మరియు సాయంకాలమునందు మేము శ్రద్ధను ఉపాసించుచున్నాము. కావున, ఓ శ్రద్ధ దేవత! మమ్ములను ఈ విశ్వమున కర్మల యందు శ్రద్ధావంతులను చేయుము. అని ఋగ్వేద సూక్త మంత్రాలలో శ్రద్ధనుగూర్చిన సాధన యొక్క ప్రాముఖ్యతను తెలియజేయనైనది.

అనేక ఉపనిషత్తుల యందుగూడా **'శద్ధ'** అనే సాధనగూర్చి విశేషంగా తెలియజేయబడిన

వి. కఠోపనిషత్ లో **"శ్రద్ధాఽవివేశ సోఽమన్యత"** (1-1-2) నచికేతసుడు శ్రద్ధ ఆవహించిన వాడై ఈవిధంగా తలచుచున్నాడు.

బృహదారణ్యకోపనిషత్ భాష్యంలో **"శ్రద్ధా చ బ్రహ్మవిజ్ఞానే పరమం సాధనం"** (2-1-1) అని జగద్గురు శ్రీ ఆదిశంకరాచార్యులవారు బ్రహ్మజ్ఞానమును పొందుటయందు శ్రద్ధ అనేది గొప్ప సాధనమని చెప్పారు.

కైవల్యోపనిషత్తులోకూడా అశ్వలాయనుడు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి సర్వపాపములను పోగొట్టు (ప్రక్షాళన) కొని పరాత్పరుడగు ఆ భగవంతుని పొందుట ఎట్లు? అని ప్రశ్నించగా— **"తస్మై సహోవాచ పితామహశ్చ శ్రద్ధా భక్తి జ్ఞానయోగాదవేహి"** ( కై.2) అని బ్రహ్మదేవుడు తెలియజేశాడు, కర్మలు మొదలగువాటిద్వారా పొందలేవు, శ్రద్ధ, భక్తి, జ్ఞాన, యోగములు - అను ఈ నాల్గు సాధనల ద్వారా మాత్రమే పొందగలవని చెప్పడమైనది.

తైత్తరీయోపనిషత్తులో కూడా **"శ్రద్ధయా దేయమ్, అశ్రద్ధయాఽదేయమ్"**(1-11) ఎవరికైనా ఏదైనా ఇచ్చేటప్పుడు శ్రద్ధగా ఇవ్వవలెను.అశ్రద్ధగా ఇవ్వరాదు—అనికూడా చెప్పడమైనది.

శ్రీమద్భగవద్గీతలో కూడా శ్రీకృష్ణపరమాత్మ **'శ్రద్ధ'**అనే శబ్దమును ఇరవైచోట్ల ప్రయోగించారు.

1)**"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"**(గీత.4-39) శ్రద్ధాళువగు వ్యక్తికే జ్ఞానము కలుగుతుంది.

2)**"శ్రద్ధయా పరయోపేతాః"** (గీత.12-2);

3)**"శ్రద్దధానా మత్పరమాః"** (గీత.12-20)

ఈ విధంగా పలుచోట్ల **'శ్రద్ధ'** శబ్దమును ప్రయోగించారు.

ఉదాహరణకు — మహాభారతములో ఏకలవ్యుడు కూడా ద్రోణాచార్యుడు ధనుర్విద్యను నేర్పించే వీలులేదు-అంటే మట్టిచేత ద్రోణాచార్యుని విగ్రహం చేసుకొని ధనుర్విద్యను నేర్చుకోవడమే కాకుండా, గురుదక్షిణగా బొటనవేలు అడిగితే కూడా గురువుమీద ఉన్న భక్తితో దాన్ని సమర్పణ చేయడమైనది. మనం చేసే సాధనలో మనయొక్క శ్రద్ధను, ఏకాగ్రతను బట్టి ఫలము అధికంగా వస్తుంది. మనమేది చేయకుండా శ్రద్ధ అసలే లేకుండా కర్మచేసి ఫలము కావాలంటే వచ్చే అవకాశం తక్కువ. కావున, ఆధ్యాత్మిక పురోగతి సాధించాలన్న వ్యక్తికి శ్రద్ధ అనేది చాలా చాలా ముఖ్యము. శ్రద్ధాభక్తులచే జ్ఞానోదయమౌతుంది, తద్వారా —

**జ్ఞానాదేవతు కైవల్యమితి శ్రుత్యా నిగద్యతే ।**

**జ్ఞానస్య ముక్తిహేతుత్వమన్యవ్యావృత్తిపూర్వకమ్** ॥(సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము 170) అని శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు చెప్పినట్లు మోక్షమును పొందగలము.

శ్రీమద్భగవద్గీతలోనే శ్రీకృష్ణపరమాత్మ **'శ్రద్ధ'**లేనిచో ఇహపర సౌఖ్యములుగాని, మోక్షము గాని దుర్లభమని వ్యతిరేకముఖముగా చెప్పినాడు.

i) **అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।** (4-40)

ii)**అశ్రద్దనాః పురుషాః ధర్మస్యాస్య పరంతప ।** (9-3)

iii) **అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।** (17-28)

i)వివేకహీనుడు, శ్రద్ధలేనివాడు, సంశయగ్రస్తుడు — ఈ ముగ్గురు పరమార్థ విషయమున తప్పక భ్రష్టులగుదురు. ఈ లోకమునగాని, పరలోకమునగాని ఎట్టి సుఖమును పొందజాలరు.

ii)నేను ఉపదేశించిన ధర్మమార్గమునందు విశ్వాసము లేనివారు నన్ను పొందజాలరు. మృత్యురూప సంసార చక్రమునందే పరిభ్రమించుదురు.

iii) ఓ అర్జునా! శ్రద్ధ (విశ్వాసం) లేకుండా చేయబడు హోమము, దానము, తపస్సు, ఇంకా జరుపబడు శుభకర్మలన్నియు అసత్ అని చెప్పబడును. దానివల్ల జీవించియుండగాగాని లేక మరణించిన పిదపగాని ఎట్టి ప్రయోజనము లేదు.

''**అశ్రద్ధయైవాభిహతాశ్చ సర్వే**

**మజ్జన్తి సంసార మహాసముద్రే ॥**'' (సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము.212)

జనులందరు పెద్దలవాక్యములందును, వేదాన్తవాక్యములందును విశ్వాసములేనివారగుటచేత ముక్తిని పొందనేరక యెల్లపుడు సంసారసముద్రముననే మునిగితేలుచున్నారు.

**'అశ్రద్ధ'** అను మహమ్మారి ఇహపర లోకాల ఫలాలు కూడా లేకుండాజేసి, సంసార సాగరమున పడద్రోయుచున్నది.

**అశ్రద్ధా పరమం పాపం శ్రద్ధా పాపవిమోచనీ ।**

**జహాతి పాపం శ్రద్ధావాన్ సర్పో జీర్ణామివ త్వచామ్ ॥** (మ.భా.శాంతి ప.264-15)

శ్రద్ధలేకుండుటయే మహాపాపమగును. శ్రద్ధయే పాపవినాశిని. పాము కుబుసమును విడుచునట్లు శ్రద్ధావంతుడు పాపమును త్యజించును. అని శాస్త్రములు ఉద్ఘోషించుచున్నవి. కావున, అశ్రద్ధను విడిచి శ్రద్ధాళువులమై సాధనచేసి బ్రహ్మానందముతో విరాజిల్లెదము గాక!

ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు





శ్రీ కైవల్యానన్ద సరస్వతీ స్వామీజీ
Cell: 8792375429

## ఆనంద జీవనము

ఆనందము కావాలన్న లక్ష్యముతో-డబ్బు సంపాదన, భార్య పిల్లలు, అధికారము మున్న గు బాహ్య సంపదను చాలావరకూ ప్రోగుచేసుకొన్నాడు, ఒక సామాన్య మనిషి, కాని ఆనంద ప్రాప్తి కాలేదు. దుఃఖములోనే జీవనము గడిచిపోవుచున్నది. బాహ్యసంపదతో లాభము లేదని వివేకము చేసుకొన్నాడు. "ఆనందము ఎలా ప్రాప్తి కాగలదని? ఒక మహాత్ముని దగ్గరకు వెళ్ళి శ్రద్ధా భక్తులతో ప్రశ్నించాడు.ఈప్రశ్నకు సమాధానంగా ఆ మహాత్మ ఇలా అన్నాడు- నాయనా, నీ లోనే ఉన్న రామస్వరూపాన్ని మరిచావు, నీ ఆత్మారాముని మరిచావు, నీ ఆనందరాముని మరిచావు". వివేకచూడామణి గ్రంథకర్త మనిషి సమస్య మోహమన్నాడు. 85 వ శ్లోకములో **"మోహఏవ మృత్యుః"**అన్నారు.మరియు 138వ శ్లోకములో **"అతస్మింస్తద్బుద్ధి ప్రభావతి విమూఢస్య తమసా"**అన్నారు.అనగా ఈజగత్తునకు వచ్చినపుడు బాహ్యవిషయముల జ్ఞానమూ లేదు, తన్ను గురించి కూడ జ్ఞానమూ లేదు.అవిచారముతో"**శరీరమే నేనని,శరీరానికి సంబంధించినది నాదని**"తప్పుతెలివితో జీవించుచున్నాడు మనిషి.దీనినే **"నైసర్గికోఽయం లోకవ్యవహారః"** (అధ్యాసభాష్యములో)అన్నారు శ్రీశంకర భగవత్పాదులు.ఈసమస్యకు పరిష్కారము **"ఆత్మానాత్మ వివేకమే"** అంటున్నది వివేకచూడామణి.

**ఆత్మానాత్మ వివేకః కర్తవ్యో బంధముక్తయే ।** (52 వ శ్లోకము)

**తేనైవానందీభవతి స్వం విజ్ఞాయ సచ్చిదానందమ్ ॥** (52 వ శ్లోకము)

ఒక్కసారి వివేకముతో చూచుకొన్నచో - బాహ్య విషయములు, శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము అన్నియూ దృశ్యములే. నాకు తెలియబడుచున్నాయి. వీటికన్నిటికీ సాక్షియైన, దృక్ స్వరూపమైన నా నైజ స్వరూపమే ఆనందము. దృశ్యరాశినంతయూ తీసివేసి మిగిలిపోవు అనుభవము ప్రతిమనిషికీ వున్నది. మిగిలిపోయి ఉన్నది పవిత్ర అస్థిత్వము. దానినే జాగ్రదవస్థ, బుద్ధి, నిద్రయని భ్రమపడుచున్నాడు. ఆ స్థితిని ఎలా అనుభవించుచున్నామో అలా చూచుకొంటే, అది నిద్రకాదు మన నైజ అస్థిత్వమే, ఆనందమే. ఇది తెలిసినవానికి - ఎప్పటికీ మనము ఆనంద స్వరూపులమే. దు:ఖానికి అవకాశమే లేదు అని స్పష్టముగా తెలియును.

వస్తు స్థితి **"ఆనందము"**.అయినా, ప్రకృతిలోని మూడు గుణములు జీవిని బంధించు చున్నాయి.

తమోగుణము - అజ్ఞానము, ప్రమాదము, ఆలస్యము, నిద్రా - వీటితో బంధించును.

రజోగుణము - తృష్ణ, విషయసంగము, కర్మ సంగము - వీటితో బంధించును.

సత్త్వగుణము - సుఖమునకూ జ్ఞాన సంగమునకు బంధించును.

ఎంతవరకూ జీవి తాను కర్తను, భోక్తను అని జీవించునో అంతవరకూ ఈ గుణముల బంధము తప్పదు.**"గుణములే కర్త, నేను అసంగుడను"** అను జ్ఞానమును పొందునో, అపుడు పరమాత్మ స్వరూపమునే పొందును.జన్మాది దుఃఖములనుండి విడుదలపొందును. అటువంటి వాడే జీవన్ముక్తుడు, ఆనందముగా జీవించగలడు.

అలా అందరూ ఆనందముగా జీవించాలన్న శుభ ఆశతో -

ఓం తత్సత్ ఓం



కంటకాది వృక్షముల మధ్య మంచి చెట్టు వృద్ధికి రాదు. ఆ పిచ్చి చెట్లన్నిటిని పెరికివేసిన మాత్రమే అభివృద్ధినొందును. అట్లే, హృదయమున దృశ్యవృత్తులుండినచో, ఆత్మజ్ఞానము సరిగా అభివృద్ధి కాదు. వృత్తిరాహిత్యముచే సత్వరము జ్ఞానాభివృద్ధి కలుగును.

(శ్రీ మలయాళస్వాములవారు)



శ్రీ స్వరూపానంద భారతీ (చిన్నమాతాజీ),
ఆనందాశ్రమము,అక్కివరం, విజయనగరం.

**ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో,**
**వంశ ఋషిభ్యో మహాద్భ్యో నమో గురుభ్యః ॥**
**ఓం యుక్తాహార విహారాయ వివిక్తస్థల వాసినే ।**
**మలయాళ యతీంద్రాయ బ్రహ్మనిష్ఠాయ తే నమః ॥**

ప్రాతః స్మరణీయులు పూజ్య శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాముల వారి పాద పద్మములకు నమస్కరిస్తూ —

పూజ్య శ్రీ బ్రహ్మనిష్ఠ సద్గురు విద్యానందగిరి స్వాముల వారి పాద పద్మములకు నమస్కరిస్తూ —

మద్గురు త్యాగమయానందమాతాజీ గారి పాద పద్మములకు నమస్కరిస్తూ, అధ్యక్షుల వారికి నమస్కరిస్తూ, మాతాజీలకు, స్వామీజీలకు నమస్కరిస్తూ, సభలో ఉన్నటువంటి లక్ష్మీనారాయణ స్వరూపులైన మీఅందరికి శుభాకాంక్షలు తెలియజేస్తూ —

**అరయన్ శంతను పుత్రుపై విదురుపై నక్రూరుపై కుబ్జపై**
**నరుపై ద్రౌపదిపై కుచేలునిపయిన్ నందవ్రజశ్రేణిపై**
**పరగన్ గల్గు భవత్కృపారసము నాపై కొంత రానిమ్ము నీ**
**చరణాబ్జంబులు నమ్మినాను జగదీశా ! కృష్ణ ! భక్త ప్రియా !**

—: భజన :—

మాతా పితానే పాండు రంగా, బంధు గురువు పాండు రంగా ।
తల్లివి తండ్రివి పాండు రంగా, బంధు బలగా పాండు రంగా ।
స్నేహ సఖా పాండు రంగా, బంధు గురువు పాండు రంగా ।
మత్స్యావతార పాండు రంగా, కూర్మావతార పాండు రంగా ।
వరహావతార పాండు రంగా, నరసింహావతార పాడు రంగా ।
వామన మూర్తి పాండు రంగా, భార్గవ రామ పాండు రంగా ।
రామావతార పాండు రంగా, బలరామావతార పాండు రంగా ।
కృష్ణావతార పాండు రంగా, కల్క్యావతార పాండు రంగా ।

బుద్ధావతార పాండు రంగా, విఠలా విఠలా పాండు రంగా ।

మాతా పితానే పాండు రంగా, బంధు గురువు పాండు రంగా ।

పాండు రంగా పాండు రంగా, పంఢరి నాథా పాండు రంగా ॥

పాండు రంగా పాండు రంగా, పంఢరి నాథా పాండు రంగా ॥

బోలా పుండలీక వరదా హరి విఠల్, శ్రీ జ్ఞానదేవ తుకారాం పంఢరినాథ్

మహారాజ్ కీ జై .....................

లోకా స్సమస్తా స్సుఖినో భవంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః



సముద్రముయొక్క పైభాగమున సంచరించు చేపలు అలలతే నిశ్చలత్వమునొందక క్రింద కు పైకి పోవుచుండును. సముద్రపు అడుగున అగాధజలములో ఉండు చేపలు నిశ్చలము గా నుండును. అట్లే, దేహేంద్రియాది దృశ్యజగత్తునందు ప్రవర్తించువారు సుఖదుఃఖాది ద్వంద్వములచే తల్లడిల్లుచుందురు. కాని, దృక్స్వరూపమగు ఆత్మలో రమించువారు పరమ శాంతిని పొందుదురు. (శ్రీ మలయాళస్వాములవారు)



శ్రీ దివ్యానంద సరస్వతి స్వామి,

శ్రీ గీతాశ్రమము, కాకినాడ.

Cell: 9182337576

## ఆత్మాన్వేషణకు గురువుయొక్క ఆవశ్యకత

**ఓంకారం బిందుసంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః ।**

**కామదం మోక్షదం చైవ ఓంకారాయ నమో నమః ॥**

**ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మ విద్యా సంప్రదాయ కర్తృభ్యో,**

**వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥**

ఈ పండరీపుర క్షేత్ర అధిష్ఠాన దేవత అయినటువంటి శ్రీపాండురంగ స్వామివారి దివ్య పాదపద్మములకు నమస్కరిస్తూ,అఖిలాంధ్ర సాదు పరిషత్ అధ్యక్షులైన పరమ పూజ్య శ్రీ పరా విద్యానందగిరి మాతాజీ వారికి నమస్కరిస్తూ, ఈపూట సభాధ్యక్షులుగా ఉన్నటువంటి శ్రీ శివ చైతన్య మాతాజీ వారికి నమస్కరిస్తూ,వేదికస్థ పూజ్య స్వామీజీలు మరియు పూజ్య మాతాజీల వారి పాదపద్మములకు ఓం నమో నారాయణాయ తెలియజేస్తూ, ఇక్కడకు విచ్చేసినటువంటి ప్రియాత్మ బంధువులైన మీ అందరికీ ఆ పాండురంగ స్వామి శుభాశీస్సులు తెలియజేస్తూ –

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురర్దేవో మహేశ్వరః ।**

**గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥**

గురువు బ్రహ్మ ఎలా అయ్యాడు. గురువు విష్ణువెలా అయ్యాడు. గురువు మహేశ్వరుడెలా అయ్యాడు. గురువు సాక్షాత్ పరబ్రహ్మ ఎలా అయ్యాడో ఇప్పుడు తెలుసుకుందాము.

బ్రహ్మదేవుడు జీవుల్ని సృష్టిస్తూ ఉంటాడు. విష్ణుమూర్తి ఆ జీవుల్ని పోషిస్తూ ఉంటాడు. మహేశ్వరుడు ఆ జీవులను లయము చేస్తూ ఉంటాడు. గురువు శిష్యునిలో అజ్ఞానాన్ని తొల గించి దేహాభిమానమును పోగొట్టి యదార్థ స్వరూపంలో ఆత్మగా ఉండేటట్టు చేసి సృష్టికి ప్రతి సృష్టి చేస్తాడు. అందుకే గురువు బ్రహ్మ అన్నారు.

గురువు శిష్యునియొక్క సాధన ఎలా ఉంది-అని గమనిస్తూ మళ్లీ స్వరూప జ్ఞానము నుండి మాయవలన జారిపోయాడా అని గమనిస్తూ, మరల మరల ఆత్మజ్ఞానమును బోధిస్తూ జారిపోకుండా విష్ణుమూర్తి లాగా కాపాడుతూ ఉంటాడు.

గురువు శిష్యునియొక్క అంతఃకరణ శుద్ధి అవ్వలేదని గమనించి అంతఃకరణ శుద్ధి కోసం జపధ్యానాదులు చేయించి శిష్యుని మనసు ఆత్మయందు లయము చేయించి మహేశ్వరుడౌతాడు.

శిష్యునియొక్క మనసు ఆత్మయందు లయమవడంచేత తాను యథార్థ స్వస్వరూపంలో ఉండుటవలన గురువే కాదు, సర్వము పరబ్రహ్మముగా శిష్యుడు తెలుసుకుంటాడు. ఇదే ఈ శ్లోకం యొక్క అంతరార్థం గురువులు ఎన్ని రకాలుంటారో తెలుసుకుందాము.

గురువులు7 ఏడు రకములుగా విభజింపబడినారు. గురు గీత ప్రకారం 1) సూచక గురువు 2) వాచిక గురువు 3) బోధక గురువు 4) నిషిద్ధ గురువు 5) విహిత గురువు 6) కారణ గురువు 7) సద్గురువు. ఇప్పుడు ఒక్కొక్క గురువు గురించి తెలుసుకుందాము.

1) సూచక గురువు:— మన చిన్నతనంలో బోర్డు స్కూల్లో లౌకికమైన పాఠములను చెప్పిన గురువులను సూచక గురువులు అంటారు.

2) వాచిక గురువులు:— నీతి వాక్యములు చెప్పే తల్లిదండ్రులు, నీతి కథలు చెప్పెడి అమ్మమ్మ నాయనమ్మలు కుల పెద్దలు వీరందరినీ వాచిక గురువులు అంటారు.

3) బోధక గురువు:—మనకు గురు మంత్రాన్ని లేదా మహావాక్య మంత్రాలని బోధించే గురువులను బోధక గురువులు అంటారు.

4) నిషిద్ధ గురువులు:—చేతబడి, బాణామతి, వశీకరణ మంత్రములను బోధించే గురువులను నిషిద్ధ గురువులు అంటారు. ప్రకృతి విలయతాండవం చేసేటప్పుడు ప్రకృతి శక్తులను అదుపులో ఉంచుటకు కొంతమంది గురువులు ఈ విద్యలను పూర్వము లోకకళ్యాణార్థం శిష్యులకు బోధించేవారు.

5) విహిత గురువులు అనగా వైరాగ్యమును గూర్చి బోధించేవారు.

**ధనాని భూమౌ పశవశ్చ గోష్టే, కాంతా గృహద్వారి జనశ్మశానే ।**

**దేహ శ్చితాయాం పరలోక మార్గే, కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥**

మనిషి మరణిస్తే ధనము, బంగారము, డబ్బు, ఇల్లు, పొలం, దస్తావేజులు ఈ భూమి మీదే విడిచిపెట్టాలి. భార్య గృహద్వారము వరకే వస్తుంది. బంధువులు, ఇరుగుపొరుగు వారు,

స్నేహితులు శ్మశానము వరకు వస్తారు. దేహము చితిమంటల్లో కాలిపోతుంది. మనము చేసుకున్న కర్మను బట్టి జీవుడు యాతనా శరీరము ద్వారా ఏకాకియై తిరుగుతూ పునర్జన్మను పొందును. ఇట్లు, వైరాగ్యమును బోధించు గురువులను విహిత గురువులంటారు.

6)కారణ గురువులు:— తత్త్వమస్యాది మహావాక్యములద్వారా భవరోగములను నివారించు గురువులను కారణ గురువులంటారు. కార్యరూపంలోనున్న ఈజగత్తు మరియు 84 లక్షల రకాల జీవులయొక్క శరీరము పుట్టుటకు కారణము-ప్రత్యగభిన్న పరమాత్మయే యని శ్రుతులు స్మృతులు చెబుతున్నాయి.

**"యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి ॥"** (తై.3-1)

**"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ।"** (గీత.7-6)

**"జన్మాద్యస్య యతః"** (బ్ర.సూ.1-1-2)

పరిదృశ్యమాన సంపూర్ణ జగత్తు బ్రహ్మజ్ఞాన బాధ్యము(మిథ్య)యే యగును. ఏది జ్ఞానముచే బాధింపబడునో అది మిథ్యావస్తువయ్యే ఉంటుంది.**"నిరధిష్ఠాన విభ్రాన్తేః క్వాప్య సిద్ధితః"** (వే.పం.7-6) అధిష్ఠానము లేకుండా భ్రాన్తి యెక్కడగూడ దృష్టిగోచరము కాదను నియమాను సారము, ఈ అధ్యస్త జగత్తునకు అధిష్ఠానము పరబ్రహ్మము. అధిష్ఠానము అధ్యస్తమునందు ఘటమునందు మృత్తిక వలె సర్వత్ర వ్యాపించి యుండును.

**"మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।"** (గీత.9-4)

**మృత్పిండమేకం బహుభాండరూపం సువర్ణమేకం బహుభూషణాని ।**
**గోక్షీరమేకం బహుధేనుజాతం ఏకో పరాత్మా బహుదేహ వర్తి ॥**

కుండ,మూకుడు,దాకా,ప్రమిద ఇత్యాద్యనేక వస్తువులుగా కనిపించిననూ, కారణమగు మట్టి మాత్రము ఏకము. గాజులు ,గొలుసు, ఉంగరము, జిగిని,మ్యాంగో హారము అనేక ఆభరణములుగా కనిపించిననూ మూలమైనది బంగారము ఒక్కటే. ఆవులు అనేక రంగుల్లో ఉన్నప్పటికీ వాటి పాలు తెల్లగా ఉన్నట్లుగా, జీవులు జగత్తు అనేక రూపంలో కనపడినా సర్వకారణమగు పరమాత్మ మాత్రము ఒక్కడే—అని కార్య కారణాల గురించి చెప్పే గురువులను కారణ గురువులంటారు.

7)సద్గురువు లేక పరమగురువు:—సమస్త సంశయ సమూహమును నిర్మూలించుటలో నిపుణులు జననమరణ భయమును పోగొట్టు మహితాత్ముడు పరమ గురువు. శిష్యుని యొక్క అనేక జన్మల పుణ్యఫలము వలన ఇటువంటి పరమ గురువు లభిస్తాడు. చేపవలె చూపు

ద్వారా, కోడి వలె స్పర్శ ద్వారా, తాబేలు వలె, సంకల్పము ద్వారా శిష్యుడిని ఉద్ధరిం ప జేస్తాడు. ఇట్టివాడు పరమ గురువని గురుగీతలో పరమశివుడు పార్వతీదేవికి చెప్పియు న్నాడు. అటువంటి పరమగురువుల్ని ఆశ్రయించి శ్రవణ,మనన, నిదిధ్యాసద్వారా స్వస్వరూప స్థితిని పొందాలి.

**"గురువు లేక ఇలను గురుతెట్లు గలుగురా అజునికైన వాని అబ్బకైన ।**
**తాళపు చెవిలేక తలుపెట్లు ఊడురా విశ్వదాభిరామ వినరవేమ! ॥"**

ఈ శరీరంలో ఆత్మ తత్త్వమును గుర్తు తెలియాలంటే సద్గురువుయొక్క అత్యంతావశ్య కత ఉన్నది. తనకు తానుగా తెలుసుకొనలేడు. నిత్యమగు పరబ్రహ్మతత్త్వమును తెలుసుకొను టకు శ్రోత్రియుడు మరియు బ్రహ్మనిష్ఠుడగు శ్రీగురుదేవులనే శరణు వెళ్ళవలెను.**"శాస్త్రజ్ఞోఽపి స్వాతన్త్ర్యేణ బ్రహ్మాన్వేషణం న కుర్యాదిత్యేతద్ గురుమేవేత్యవధారణ ఫలమ్"**(ముం.భాష్యము 1-2-12) స్వతంత్రముగా తెలిసికొనవలెనన్న కొన్ని జన్మలకైననూ సంభవము లేదు. తాలపు చెవి లేకుండా తలుపులు రావు కదా! ప్రతి ఒక్కరికి గురువు అత్యవసరమై ఉన్నది. అటువంటి సద్గురు పరమాత్మ మనందరికీ ఆయురారోగ్య అష్టైశ్వర్యములు ఇచ్చి భక్తి, జ్ఞాన, వైరాగ్యములు ప్రసాదించు గాక! మరియు ఈ పంఢరీ క్షేత్ర పాండురంగస్వామి మనందరినీ అనుగ్రహించును గాక! ఈ అవకాశం ఇచ్చిన అఖిలాంధ్ర సాధుపరిషత్ అధ్యక్షులవారికి మరొక్కసారి నమస్క రిస్తూ, హరిః ఓం తత్సత్. శుభం. శుభమస్తు. స్వస్తి.



సముద్రమందలి ముత్యపు చిప్పలోని పురుగు నోరు తెఱచుకొని స్వాతి కార్తిక వర్షబిందు వుకై సముద్రోపరిభాగమున ఎట్లు నిరీక్షించుచుండునో, అట్లే ఎవని మనస్సు సంసారసాగ రమున సర్వేశ్వర కరుణామృత పానమునకై నిరీక్షించుచుండునో - అట్టివాడే పరమ భక్తుడు. ముత్తెపు చిప్పలోని పురుగు గ్రహించిన జలము ముత్యముగా మారునట్లు, అత్తటి మనుజుని యందలి భక్తి - దైవానుభూతియను ముత్యముగా మారుచున్నది.

(శ్రీ మలయాళస్వాములవారు)



బ్రహ్మర్షి సద్గురు పూజ్య శ్రీ కవీశ్వరానంద స్వామి.
శ్రీ గీతాసత్సంగాశ్రమం గురుపీఠం 75, po.త్యాళ్ళూరు,
పిన్ కోడ్. 522436. పెదకూరపాడు(మం), పల్నాడు(జిల్లా)
అమరావతి. (A.P) cell: 99513 61867

ఓం శాంతిః శాంతిః శాంతిః

**ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో ,**
**వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥**

**శ్లో ॥ దిక్కాలాద్యనవచ్ఛిన్నానంత చిన్మాత్ర మూర్తయే ।**
**స్వానుభూత్యేకమానాయ నమః శాంతాయ తేజసే ॥** (భర్తృహరి నీతి శతకము.1)

ఆఖిలాంధ్ర సాధు పరిషత్ 58 వ సభ కు విచ్చేసిన ప్రియాత్మ భక్త బంధువులందరికీ నా హృదయపూర్వక నమః సుమాంజలులు సమర్పించుచున్నాను.....

శ్రీ అఖిలాంధ్ర సాధు పరిషత్ 58 వ వార్షిక మహాసభలు పూజ్య గురుమాతాజీ శ్రీ పరావిద్యానందగిరి స్వామిని వారి అధ్యక్షతన ,మరియు పూజ్య గురుదేవులు శ్రీ జగదీశ్వరానంద గిరిస్వాముల వారి కార్యదర్శకత్వంలో ఈనెల 29-1-2024 నుండి 31-1-2024 వరకు నిర్విఘ్నంగా కొనసాగి నిర్వహించబడుతున్నందున మహదానందదాయకమైయున్నది. ఎట్లన?

**ఓం బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం,**
**ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్ ।**
**ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం,**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥** (శ్రీయోగవా.అంతిమ శ్లోకము)

ఎంతటి భావ ప్రాప్తి సుందరమీ సభ. సాధుసత్సంగాలు ఎంతయో అద్వితీయంగా జరుగుచున్నవి. భగవంతుడు ప్రస్తుతం సాధుపరిషద్రూపంలో మన అందరి హృదయాలలో దర్శనం గావించుచున్నాడు. ఇది ఎన్నిజన్మల పుణ్యఫలమో?

**శ్లో ॥ బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః ॥** (గీత.7-19)

అనేక జన్మములలో నాచరించిన పుణ్యసంస్కారమువలన నంతఃకరణ పారిశుద్ధ్యము బడిసి కట్టకడపట జ్ఞానము గలవాడై నన్ను పొందుచున్నాడు. సర్వము వాసుదేవ స్వరూపమని భావించును. అటువంటి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు.లోకములో అరుదుగ నుండునని భావము.

అని శ్రీ గీతాచార్యులు విశేషంగా ప్రతిపాదించి తెలియజెప్పారు.ఇంకా ఇలా అన్నారు—

**శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్ యతతి సిద్ధయే ।**

**యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥** (గీత.7-3)

వేలకొలది జనులలో ఏ ఒక్కడో పూర్వపుణ్యవిశేషముచే ఆత్మజ్ఞాన సిద్ధి కొఱకు ప్రయత్నము చేయుచుండును. అట్లు ప్రయత్నముచేయుచు సిద్ధిని పొందిన వారలలో ఏ ఒకానొకడు మాత్రమే నన్ను యథార్థముగా తెలిసికొనుచున్నాడు.

ఇంకను సర్వ ప్రాణులలో మానవజన్మ ఉత్కృష్టమైనది అని పూజ్యశ్రీ భగవత్పాదులు ఆదిశంకరుల వారు 'వివేకచూడామణి' యను గ్రంథంలో —

**శ్లో॥ దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహ హేతుకమ్ ।**

**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥** (వి.చూ.3)

మనుష్యత్వము, ముముక్షుత్వము (మోక్షేచ్ఛగలుగుట) మరియు మహాపురుషుల ఆశ్రయము అనెడు యీ మూడు కష్టముచే లభించునవి. అనగా, దైవానుగ్రహమే యీ మూడింటికి హేతువు.(దైవానుగ్రహము చేతనే కలుగునని భావము).

మానవుడే మాధవుడు, నరుడే నారాయణుడు,జీవుడే దేవుడు,అనెడి సత్యాన్ని మరచి ఎక్కడెక్కడ ఏదేదో మానవుడు వెదుకులాడుతుంటాడు.తనలోతన్ను జూచుకోడు.

**శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే ।**

**జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥** (రఘువంశము 1-1)

జగత్తుకు పితరులై శబ్దార్థములవలె నిత్యసంబంధముగల పార్వతీపరమేశ్వరులను శబ్దార్థజ్ఞానము కొఱకై నమస్కరించుచున్నాను. అని శ్రీమహాకవి కాళిదాసుగారు తల్లిదండ్రుల ప్రభావం గూర్చి వక్కాణించాడు.

**ఆ.వె॥ తల్లిదండ్రులెన్న తొల్లింటి గురువులు,**

**పార్వతి భవులెన్న పరమ గురులు ।**

**సద్గురుడు లభించ జన్మ సాఫల్యమౌ ॥**

**విశ్వదాభిరామ! వినురవేమ!**

అని మహాయోగి వేమనగారు సెలవిచ్చారు.

ఇంకను గీతలో పరమాత్మ గురువుయొక్క పరమావశ్యకతను, గురుశిష్యుల అనుబంధ పవిత్రతను గూర్చి ఇలా అన్నారు.

**శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**

**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥** (గీత.4-34)

తత్త్వవేత్తలైన ఆత్మజ్ఞానులు నీకు జ్ఞానము నుపదేశించగలరు. అట్టి జ్ఞానమెట్లు గలుగుననిన, వినయముతో చేయు నమస్కారముచేతను, సమయమును కనిపెట్టి యడుగుటచేతను, గుర్వాజ్ఞను పాలించుటచేతను వారు చెప్పగలరు.

గురువు అవసరమా? అనవసరమా? అని ప్రశ్నచేయువారికి సమాధానముగా భగవంతుడే గురువు అవసరమని ఉపదేశించుచున్నాడు. మఱియు గురుకులవాస మెట్లుజేయవలెనో అదిన్ని యిచట తెలుపడమైనది. ఐతే భగవంతు డేల అర్జునునకు జ్ఞానము తెలుపగూడదన - భగవంతుడు భక్తుల కనుగ్రహము జేయువాడు మాత్రమే, బ్రహ్మతత్త్వజ్ఞానమును మహాత్ములవలననే పొందవలసినదిగా భగవంతుడు తన లోకసృష్టికార్యములో నిశ్చయించుకొన్నాడు. అట్టి జ్ఞానము గలుగుటకు ఏమేమి సహాయము కావలెనో అదంతయు భగవంతుడు భక్తులకు అనుకూలము జేయును. సాక్షాత్ భగవంతుడు రామకృష్ణాద్యవతారము లెత్తియు వసిష్ఠ సాందీపాదులను గురువులుగా గ్రహించుకొనెను. ఇదియే ఋషి పరంపర, ప్రాచీన పద్ధతి. సార్వభౌమునకు తనరాజ్యములో సర్వాధికారము గలదు. కాని ఆ చక్రవర్తిని ఎవరైన భూమి కావలెనని ప్రార్థించినచో దానిని తానివ్వతలంచినను ఆయా డిపార్టుమెంటువారికి తెలిపి వారిచేతనే యిప్పించును,ఇది సృష్టియొక్క నియతియైయున్నది.అంతియేగాని సర్వేశ్వరునకు జ్ఞానము ఉపదేశించుటకు శక్తి లేక యిట్లు చెప్పినాడని గాదు. రామకృష్ణాద్యవతారములు బ్రహ్మజ్ఞాన ముపదేశించుటకు గ్రహించిన యుపాధులు గావు. అవి లోకసంరక్షణార్థముగా గ్రహించిన క్షత్రియ శరీరములు. భగవంతుడు జ్ఞాన ముపదేశించుటకు శ్రీ దత్తాత్రేయ, శ్రీ వ్యాస, శ్రీ కపిలాది శరీరములను గ్రహించియున్నారు. కావుననే భగవదవతారములలో ముఖ్యములగు 24 అవతారములలో దత్తాత్రేయ వ్యాస కపిలాదులను చేర్చుకొనుటకు కారణమైనది. జ్ఞానోపదేశధర్మము ఋషులది, దుష్టనిగ్రహ శిష్టపరిపాలన ధర్మము భగవంతునిది. దీనివల్ల మహాత్ములపై సర్వేశ్వరుని కెంత అభిమానము గలదో గోచరము గాగలదు. తత్త్వదర్శినః అని గురులక్షణము తెలిపినదానిని జ్ఞాపకముంచదగినది. అనగా బ్రహ్మతత్త్వజ్ఞానము గలవారే గురువు లగుదురు.

మన మానవజన్మకు ఇంతటి శ్రేష్ఠత్వం పరమాత్మ కల్పించిపెట్టాడు. కావుననే ఆ శ్రీ కృష్ణ పరమాత్మను పూజ్య మాతృశ్రీ కుంతీదేవి కష్టాలనే కడలిగా ప్రసాదించమని కోరుకొన్నది. ఒకసారి భోజుని పుత్రి కుంతీదేవి బాల్యంలో అతిథిగా ఏతెంచిన దుర్వాస మహర్షికి భక్తిప్రపత్తులతో పరిచర్యలు చేసినది. ఆ సేవలకు మహర్షి మురిసిపోయి అవ్యాజానురాగంతో ఒక సూర్యతేజస్సుతోకూడిన దివ్యమంత్రోపదేశం చేశాడు. ఆ కుంతీదేవి యౌవ్వనదశలో ప్రవేశిం

చిన తరుణంలో సూర్యభగవానునికి అర్ఘ్యపాద్యములు సమర్పించి తనకు మహర్షి ఉపదేశించిన మంత్రమును శ్రద్ధతో పఠించిన తత్ఫలితంగా సహజ కవచకుండలాలతో శుభతేజస్సు గల కుమారునికి జన్మనిచ్చింది.ఈబిడ్డడు మహా పరాక్రమవంతుడుగా దానవంతుడుగా యశోవంతుడుగా చరిత్రలో ప్రశంసలనందుకొంటాడు-అని భాస్కరుడు ఆశీర్వదించి వెళ్లి తన స్థానాన్ని అలంకరిస్తాడు. కర్ణుడు త్యాగానికి ప్రతీకగా నిలిచాడు.లోకంలో ఎవరైనా దానగ్రహీతలు కర్ణుని పేరునే స్మరిస్తారనేది ఇచ్చిన వారిని దీవించటం పరిపాటి. అందుకే —

**"న ప్రజయా న కర్మణా న ధనేన త్యాగే నైకేఽమృత త్వ మానశుః"** (కైవల్యోపనిషత్ 1-3) అని ఉపనిషత్ సూక్తి. కుంతీ గర్భ శుక్తిముక్తా ఫలుడు కర్ణుడు అయినా పాండవ వంశ వర్ధనుడుగా గాక కౌరవ పక్షంలో చేరినాడు.

పంచపాండవులలో ధర్మరాజు కుంతీగర్భమున రెండవ వాడుగా ధర్మమునకు ప్రతీకముగా జన్మించాడు. దైవీగుణ సంపత్తిలో 1.త్యాగము, 2.ధర్మము, 3.అభయము భయము లేని తనము అనగా నిర్భయత్వము. ఇందుకు నిదర్శనం భీముడు.ఇతరులను భయపెట్టేవాడే గాని తానెప్పుడూ భయపడడు. ఇక జన్మించినది కుంతికి 4 వ గర్భమైనా పాండవులలో 3 వ వాడు మహాయోధుడు అర్జునుడు. మహాపరాక్రమం కలవాడు. బంగారంవంటి గుణము. విజయుడు విజయమే కానీ ఓటమి నెరుగని వాడు. ధనంజయుడు. దిక్కుల జయించి యజ్ఞార్థం ధనాన్ని సంపాదించాడు.కావున ధనంజయుడుగా ప్రఖ్యాతుడు.

మహాసాధ్వి కుంతీమాత తాను సిద్ధింప జేసుకొన్న ఆ ఉపదేశ మహా మంత్రమునే తన చెల్లియైన మాద్రి సతికి ఉపదేశించినది. ఆ మాద్రి మహాదేవి ఆ మంత్రమును వినియోగించి తద్వారా అశ్వనీ దేవతలనుపాసించి నకుల సహదేవులను సంతానముగా తన గర్భఫలంగా కన్నది. వారును మహావీరులుగ రాణించారు. నకులుడనగా కులము లేనివాడు.కులము నధిగమించినవాడు.ఎవరికి ఎక్కడ త్యాగము,ధర్మము,నిర్భయత్వం,ఉంటుందో అక్కడ ఈ గుణాలుగలవారికి ఇక కులంతో పనిలేదు. కులము పరిణితిలేక పరిమితితో కూడుకొన్నది. కావున గురుకులంలో విద్యనభ్యసించినవారికి ధర్మనిర్భయాలుగలవారికి విజయం సాధ్యము. ఆ పైన కులం పనిలేదు. కులము,స్థలం మతము,జాతి, ఇవన్నీ నిమిత్త మాత్రాలు. త్యాగ,ధర్మ,నిర్భయత్వం,విజయం, కులము లేనితనం రూఢీ పొందిన వారికి సహదేవత్వం తప్పక సిద్ధించి మోక్షానందం యోగసాధకులకు చేకూరుతుంది.అనేది జన్మబంధ విముక్తికి లక్ష్యమై మానవోద్ధరణకు అవగాహనతోకూడిన జ్ఞానం సంతరించుకోవడంతో దోహదపడుతుంది. ఈ మేరకు జరుపుచున్న మహారాష్ట్ర పంఢరీపుర దైవక్షేత్రంలో అఖిలాంధ్ర సాధుపరిషత్ మహాసభలు భగ

వద్భక్తి సంపన్నులకు ముముక్షుజన సందోహములకు ఆదర్శమై ఆచరణాత్మక సందేశాన్ని అందించగలదని ఆశిస్తూ శ్రీసద్గురు భగవానుని భక్తి జ్ఞాన కర్మ యోగ వైరాగ్య సేవలతో సేవించు వారికి శ్రీ పరమాత్మ కృప తప్పక లభించు గాక!

**శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**

**తత్ర శ్రీర్విజయో భూతిర్ ధృవానీతిర్మతిర్మమ ॥** (గీత.18-78)

ఓ ధృతరాష్ట్ర మహారాజా ! యోగసిద్ధులకు (ప్రభువు) నీశ్వరుడును, విల్లును ధరించిన యర్జునుడును యేపక్షమందున్నారో యచ్చటనే అనగా (పాండవ పక్షమునందే రాజ్యలక్ష్మియు, జయ లక్ష్మియు, నైశ్వర్యాభివృద్ధియు, న్యాయమును తొలగక నిలుచునని నా అభిప్రాయము.

యోగీశ్వరుడని చెప్పుటవలన శ్రీకృష్ణమూర్తి సర్వేశ్వరుడనియు, ధనుర్ధరుడని చెప్పుటవలన పరమశివుడిచ్చిన గాండీవము గలవాడర్జునుడనియు నిరూపించడమైనది. శ్రీకృష్ణార్జునులు ఏపక్షమునందుందురో యచ్చటనే రాజ్య లక్ష్మియు, జయలక్ష్మియు, నైశ్వర్యలక్ష్మియు చలింపక నిలుచునని సంజయుడు చెప్పుటచే తప్పక పాండవపక్షమునకే విజయము గలుగునని నిరూపించడమైనది. ఈవాక్యమును వినియైనను ధృతరాష్ట్రుడు సంధిచేసికొని యుద్ధమును మానుటయే మేలనుకొనునేమో అనుగూఢార్థము స్ఫురించుచున్నది. మఱియు ఏ పక్షమందు సత్యము, ధర్మము గలిగియుండునో యా పక్షమునందు భగవంతుడు రక్షకుడై నిలచియుండుననియు, వారికి తప్పక జయము గలుగుననియు, నీ శ్లోకమువలన భక్తులు, ధర్మాత్ములు తెలిసికొనవలయును.

సకలజీవులు సుఖశాంతులతో వెల్లివిరియుదురు గాక!

హరిః ఓం తత్సత్

జై శ్రీ కృష్ణ భగవానునకు

జై శ్రీ పాండురంగవిఠలునకు

జై శ్రీ అఖిలాంధ్ర సాధుపరిషత్తుకు జై

ఓం శాంతిః శాంతిః శాంతిః

హరిః ఓం తత్సత్





స్వామి భక్తి చైతన్యానంద సరస్వతి,
శివానంద ధామం, విజయవాడ,
అమరావతి, కరకట్ట, తాడేపల్లి-522501,
ఫోన్ - 9440360161.

## మంత్ర, యంత్ర మండలాలు, హోములు- అవగాహన

మంత్ర,యంత్ర,హోమములు,మండలాలు గురించి-అవగాహన చేసుకుంటానికి మనం ప్రయత్నిద్దాము. జన్మనెత్తిన ప్రతి వ్యక్తి శాంతిని కోరుకుంటాడు, కానీ ఆశ్చర్యకరమైన విషయం అంతరంగంలోనే శాంతి వుందనే సత్యాన్ని గ్రహించలేక బాహ్య ప్రపంచంలో వెతుకుతున్నాడు. ఆస్తిపాస్తులలో వుందని కొందరు, భోగభాగ్యాల్లో వుందని మరి కొందరు, ఎవరికి తోచినట్లు వారు వారివారి మానసిక స్థితిని బట్టి ప్రయత్నాలు చేస్తూ ఉంటారు.

హోమాలు, మంత్రాలు, యంత్రాలు, తాయెత్తులు, పేరులో అక్షరాలలో మార్పులతో పరిస్థితులు మార్పుజరుగుతాయనే సరికొత్తపోకడలు విస్తృతంగా ప్రచార మాధ్యమాలద్వారా ప్రచారంలోకి వస్తున్నాయి. అల్పాదాయంవున్న వ్యక్తులనుంచి వేరుమార్గాలలో కోట్లను కూడపెడుతున్న ప్రముఖులవరకు ఈ ప్రలోభాలకు బానిసలవుతున్నారు. వీటిద్వారా ఆర్థికలాభం పొందుదామనే మహనీయులు నీతిని, నియమాలను విస్మరించిన రాజకీయ నాయకులతో, అర్ధనగ్న వేషాలతో పిచ్చిగంతులతో ప్రజలను ఆకర్షించే సినీతారలతో ఫోటోలు దిగి వీరిలాగే మీరు కూడా సమస్యల పరిష్కారం పొందవచ్చు అనే ప్రలోభాలకు సామాన్య మానవులను దిగజారుస్తున్నారు. ఈ ఆకర్షణద్వారా తృటిలో పెరిగిపోవాలనే సామాన్యులకు హోమాలు,మంత్రాలు, యంత్రాలపై ఆసక్తి పెరిగింది. కానీ అవగాహన పెరుగ లేదు. వాటికి మహిమలు, ఫలితాలు వున్నప్పటికీ మంత్ర, యంత్రాలకు ఎలాంటి, ఏ విధమైన శక్తి, ఎలా ఒనగూడేది, తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి అవగాహన ఏర్పరుచుకోవాలి. కానీ దానితోపాటు తగిన సాధన కూడా చేయవలసి ఉంటుంది.

మనిషి తనలోని చేతనా శక్తిని, చేయగల సమర్థతను, తనకు అవసరమైన ఫలితాలని తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ పూర్తి వివరణ తెలిసిన తర్వాత మాత్రమే మంత్రాలు, యంత్రాలు,మండలాల ప్రస్తుత అప్రస్తుతాలపై ముందు వెనుకలు ఆలోచించి వెళ్ళవలసి వుంటుంది. స్వతహాగా స్వానుభవాల ద్వారా మాత్రమే ఫలితాలు తెలుస్తాయి, వేరే వారి ద్వారా కాదు. ముఖ్యంగా ముఖం చూసి కొందరు, ఫోన్లో విని నీ సమస్యలను పరిష్కరిస్తారని అని అనుకోవడం ''కొండ నాలుకకు మందు వేస్తే ఉన్న నాలుక పోయి నట్లు'' ఉన్న కష్టా

లు పోకపోగా మరింత అశాంతిని కొని తెచుకున్నవారౌవుతారు.

అర్హతను, ఉచితానుచితాలను పక్కనపెట్టి కొందరు తమవద్ద మంత్రదీక్షను తీసుకొన వలసినదిగా చెప్పడము, తీసికొనడానికి సిద్ధమవడం ఇరువురికి మంచిదికాదు. మంత్రము, మంత్రము యొక్క అధిదేవత, ఉపదేశించే గురువు - ఈ మూడు శక్తుల కలయికే ''త్రిపుటి'' అనబడుతుంది. ఈ మూటిపై విశ్వాసము, శ్రద్ధ వున్నప్పుడే మంత్రము సిద్ధిస్తుంది .

మనం చేసే ప్రతి మంత్రానికి ఒక శక్తి వుంటుంది. ఏకాంతంలో పైకిగానీ, పెదవులను మాత్రం కదిలిస్తూ కానీ, మనసులో గాని భగవంతుని నామం లేదా ఓంకారం లేదా నిష్ణాతు డైన గురుమంత్రం జపించినపుడు మస్తిష్కం లోపలి పొరల్లో హత్తుకునే గుర్తే ఈ యంత్రం. ఈయంత్రాల సమూహమే మండలం. మంత్రం అంటే శబ్ద తరంగాల ప్రతిరూపం. ఈ తరంగ ప్రవాహాన్ని, దాని శక్తిని, ప్రసరించే మార్గాన్ని, దాని ప్రభావాన్ని అవగాహన కలిగి ఉన్నప్పుడు సత్ఫలితాలు లభిస్తాయి. ఉదాహరణకి''ఓం''అనే మంత్రం రకరకాల విధానాల్లో జపించవచ్చు. ఆలా జపించినప్పుడు చుట్టూ పరిసరాలలో ప్రకంపనలు ఏర్పడి ప్రత్యేకంగా మస్తిష్కంపై ప్రభా వాన్ని చూపుతాయి. ఈ శబ్దతరంగాల ఉధృతిని బట్టి ప్రకంపనాలు అంటే (ఫ్రీక్వెన్సీ అఫ్ వైబ్రే షన్స్) మానసిక సంతులనాన్ని నిర్దేశిస్తాయి. ఆ ఫలితం వెంటనేరావచ్చు లేదా కొంత సమయం పట్టవచ్చు. కాగా వీటి ప్రభావం మనసులోని పొరల్లో సూక్ష్మాతి సూక్ష్మ యంత్ర రూపంలో చోటు చేసుకుంటాయని తెలుసుకున్నాం. సందర్భాన్ని బట్టి, సమయాన్నిబట్టి, మనిషి ప్రవర్తనను బట్టి ఆచరణరూపంలో వెలికి వస్తాయి. ఆధునిక సగటు మానవుని మస్తిష్కం స్వార్థం,క్రోధం, అసూయ,ద్వేషాలు అనే విపరీత ధోరణులతో నిండిపోయి ఉంది. మంత్రం భగవంతునిదే కావచ్చు, లోకోద్ధరణే ధ్యేయం గల పవిత్రుడైన గురువుల ద్వారా పొంది వుండవచ్చు. వీటిని వారు నిర్దేశించిన విధంగా జపించితే ఆ మంత్ర ప్రభావం మస్తిష్కంలోని దుర్గుణాలను కడిగి వేసి ప్రేమ, దయ, కరుణ, ఆప్యాయత, ఆదరణ లాంటి సద్గుణరూపం లో ఏర్పడి సద్భావనలతో సత్కార్యాల వైపు మానవుని మహాత్మునిగా మలుస్తాయి. ముఖ్యంగా మంత్ర ప్రభావం మస్తి ష్కంలో లోతు పొరల్లో ప్రవేశించి దురాలోచనలు అనే మలినాలని తీసివేసి సద్గుణాలను పెంపొందించే విధానమే ఈ మంత్ర సాధన, భయం, ఆందోళన, అస్థిరత ఎప్పుడు మాయమ వుతాయో, తాను సంపూర్ణుడనని పరహితమే తన ధ్యేయమనే భావనతో సత్కర్మలను మాత్రమే చేస్తూ తన అసలైన పవిత్ర స్వరూపాన్ని గుర్తించగలుగుతాడు. 'స్వస్వరూపాన్ని' గుర్తిం చడం అంటే అదే. అన్నిటియందు తానేనని,తానే శాంతికి-అశాంతికి బాధ్యుడననే నిజం గ్రహిం చగలుగుతారు. అదే 'జ్ఞానోదయం' అదే ముక్తి, సమాధి, నిర్వాణం. కావలసినది ఈ జ్ఞానం

కలిగిన తరువాత ఈ శరీరంతోనే అకుంఠితమైన సాధన చేయాలి. పలు విధానాలను మిడి మిడి జ్ఞానంతో స్వార్థంతో తాను కోరిన ప్రయోజనాలు సాధించడంలో ప్రయత్నం చేస్తే తాత్కాలికమైన ఫలితాలు మాత్రం వస్తాయి.

ఋషీకేశ్-"దివ్య జీవన సంఘ" వ్యవస్థాపకులు "శ్రీపూజ్య శివానంద సరస్వతి" స్వామి వారు ఇలా చెప్తున్నారు "సర్వ్, లవ్, గివ్, ప్యూరిఫై - బి గుడ్, డు గుడ్, మెడిటేట్, రియలైజ్" అంటే "సేవించు,ప్రేమించు,పంచు,పరిశుద్ధుడివి కా - మంచి వాడివి కా, మంచి పనులే చేయి, ఈ జ్ఞానోదయంతో దివ్యజీవనాన్ని గడుపు, నీ ప్రతి ఆచరణలోనూ అది ప్రతిఫలించాలి."

దేవాలయాలు కట్టడానికి,వెండి బంగారు తొడుగులకు విరాళాలు ఇవ్వటం, ఇంత ఇచ్చారని కనిపించేలాగా శిలాఫలకాలపై పేర్లు చెక్కించుకోవడం,ఫోటోలు తీయించుకోవడం హైరానపడటం పుణ్యాన్నిమాత్రం ఇస్తాయి. స్వప్రయోజనాలు ఆశించే మరికొందరికి ప్రోత్సాహాన్నిస్తాయి. ఆలోచనలను, మనసులను మాత్రం శుభ్రపరచలేవు. యజ్ఞయాగాదుల వంటి సామాజిక కార్యక్రమాలలో సామూహిక కార్యక్రమాలలో జపించే మంత్రశబ్దాలు సూక్ష్మాతిసూక్ష్మ ప్రకంపనల కలయిక అమోఘమైన శక్తిని కలిగించి ఆశించిన ఫలితాలను ఇస్తుందని ఆధునిక శాస్త్ర పరికరాలద్వారా ఎంతోమంది ఎన్నో దేశవిదేశాల శాస్త్రవిద్వాంసులు ధ్రువీకరించారు. ఇంకా వివిధ మంత్రాలపై ఎన్నో పరీక్షలు కూడా జరుగుతున్నాయి. వాటిని రకరకాల మాధ్యమాల ద్వారా మనం త్వరలో తెలుసుకునే అవకాశం కలుగుతుంది.కనుక"మంత్రాలకు చింతకాయలు రాలుతాయా"అనే భావన వద్దు. కానీ మూఢంగా తనలో మలినాలను అలానే వుంచుకొని ఏదో చేస్తే సత్ఫలితాలు వస్తాయనుకోవడం అందని ద్రాక్షపండు కాగా మేడిపండు.

సరే ఏమైనా మనసుని, ఆలోచనలను పరిశుభ్రం చేసుకోండి. మనుషులు మంచివాళ్లు కండి, మంచి ఆచరణలు చేయండి దానివలన తనకే మంచి జరుగుతుంది.

విశ్వంలోని ప్రతిజీవికి శుభం కలగాలని ప్రార్థిద్దాము

"సర్వేజనా సుఖినోభవంతు సర్వే భవతు సుఖినః"

'హరి ఓం తత్ సత్'



హరిః ఓమ్

## అఖిల ఆంధ్ర సాధు పరిషత్ - తెనాలి

స్థాపితము : 20-02-1965

రిజిష్టరు నెం. 69/65, 04-11-1965

### సంస్థ యొక్క ఆశయములు

1 ఆంధ్రదేశమునగల వివిధ సాంప్రదాయక సాధువులను,సంన్యాసులను వారి వారి స్వకీయ భిన్నమతములకు అతీతముగ,సర్వసామాన్య అభిప్రాయముల నాధారముగ గైకొని సాధువుల కొరకు ఒక సంస్థను సుసంఘటిత మొనరించుట.

2 దేశమునగల సాధు సన్యాస సమూహముల నైతిక,ధార్మిక,పారమార్థిక సంస్థితులను అభివృద్ధి గాంచుటకు తగు రీతి కృషి సల్పుట.

3 ప్రజాసామాన్యమున గూడ నైతిక, ధార్మిక, పారమార్థిక విషయముల విరివిగ ప్రచార ప్రబోధముల గావించుట.

4 పై ఉద్దేశ్యములు సఫలీకృతముచేయు పత్రికలు,గ్రంథములు విజ్ఞానయాత్రలు మొదలగు సాధనచయము ద్వారా పై విషయముల దేశవ్యాప్త ప్రచారమును నిర్వహించుట.

5 గురుకులములు, శిబిరములు, తరగతులు (వేసవి పాఠశాలలు) మొదలగువాని మూలమున ప్రచారకులకు తగు శిక్షణ నొసంగుట.

6 సరియగు నిర్వహణము లేక అనుపయోగములై శిథిలావస్థలోనున్న మఠములను, ఆశ్రమములను, మరి సన్యాసులచే నేర్పాటు గావింపబడిన యితర సంస్థలను పునరుద్ధ రించుట.

7 పై ఆశయ నిర్విఘ్న నిర్వహణమునకై శాశ్వత నిధిని సమకూర్చుట.

8 అవసరమగుచో స్థిరాస్థిరూపమైన స్థల, గృహ, ఆరామ క్షేత్ర విహారాదికములను నెలకొల్పుట.



## ప్రవేశార్హతలు

1 సంప్రదాయ సిద్ధముగ గురుసన్నిధానమున సన్యాసాశ్రమమును స్వీకరించి, కాషాయాదికముల ధరించుచు, ఆశ్రమవాసులైనవారు.

2 విరాగులై స్వతంత్రముగా కాషాయాంబరముల ధరించి, ఆశ్రమవాసులై యున్నవారు.

3 విరాగులై సన్యాసమును స్వీకరించి, అనికేతనులుగా సంచరించుచు, దేశమున భక్తి జ్ఞాన, వైరాగ్యముల ప్రబోధము గావించువారు.

4 విరాగులై యుండి సాంసారిక సంబంధముల త్యజించి, శ్వేతవస్త్రములు ధరించుచు ఆశ్రమవాసులై యుండువారు.

5 బ్రహ్మచర్య వ్రతమును పాటించుచు, కాషాయవస్త్రముల గాని, శ్వేతవస్త్రముల గాని ధరించుచు, ఆశ్రమవాసులై యున్నవారు.

6 విరాగులై సాంసారిక విషయములను దూరముగ నుంచి కాషాయాంబరముల గాని శ్వేతవస్త్రములను గాని ఉపయోగించుచు, వానప్రస్థులు మరియు ఆశ్రమవాసులై యుండువారు దీనియందు సభ్యులుగా చేరుటకు అర్హులు.

## పోషక వర్గము

జగత్కళ్యాణకరమగు ఈ సాధు పరిషత్తులో భాగస్వాములుగా నుండవలెనను ఉత్కంఠ కొంతమంది గృహస్థ భక్తులలో కలిగినది. వారి సత్సంకల్ప ప్రభావమే ఈ పోషకవర్గ నిర్మాణానికి కారణము.ఈ పరిషత్తుయొక్క మూలనిధి కొరకు విరాళములు సమర్పించు గృహస్థ భక్తులు అభిమాన వర్గమున పోషకులుగా 1000 రూ॥ లేదా అంతకు పైన ఎంతైనా చెల్లించిన వారు చేర్చుకొనబడుదురు.

అఖిల ఆంధ్ర సాధు పరిషత్తు ప్రచురించు గ్రంథములు ఉచితముగా, అఖిల ఆంధ్ర సాధు పరిషత్తు యాజమాన్యమున జరుగు సర్వ మహాసభలకు వీరికి ప్రత్యేక ఆహ్వానములు అందజేయబడును.

ఇట్లు
ప్రధాన కార్యదర్శి

తేది.29, 30, 31 జనవరి 2024 లో పంఢరీపురములో జరిగిన అఖిల ఆంధ్ర సాధు పరిషత్ మహాసభలో .........

## సభ్యత్వం కొఱకు అభ్యర్థన చేసికొన్నవారి జాబితా

రశీదు నం.601

పూజ్యశ్రీ సత్యానందగిరి స్వాములవారు, Po.ఎలబాక,

మండలం: వీణవంక, జిల్లా:- కరంనగర్, Pin- 505502 రూ.600

రశీదు నం.602

పూజ్యశ్రీ మైత్రేయి మాతాజీ వారు,Po.బీరవెల్లి, మండలం: సారంగపూర్,

జిల్లా:- నిర్మల్ (తెలంగాణ). ఫోన్: 9573688854 రూ.600

రశీదు నం.603

పూజ్యశ్రీ, అమృతానందగిరి స్వాములవారు, కిషన్ ప్రసాద్ ఆశ్రమము,

Po. తొమ్మిది రేకుల గ్రామం, కేశంపేట - మండలం,

జిల్లా:- రంగారెడ్డి. Pin: 509408, ఫోన్: 9391975363 రూ.600

రశీదు నం.604

పూజ్యశ్రీ గంగా మాతా వారు, శ్రీ శబరి మాతాశ్రమము, Po. తాడ్వాయి,

మండలం: కామారెడ్డి, జిల్లా:- కామారెడ్డి. ఫోన్ 9866528062 రూ.600

రశీదు నం.605

స్వామి బ్రహ్మవిద్యానందగిరి,

శ్రీ మహర్షి మలయాళస్వామి ఆశ్రమము, ప్లాటు నం. 48,

కళావతి నగర్, M.I.D.C. సోలాపూర్,

Pin: 413006. ఫోన్- 7017550722 రూ.600

రశీదు నం.469

పూజ్యశ్రీ కృష్ణానందగిరి మాతాజీ వారు, సద్గురు శ్రీకృష్ణ గీతాశ్రమము,

Po.పెద్దేవము, మండలం: తాళ్ళపూడి, తూర్పుగోదావరి-జిల్లా. (A.P),
Pin: 533 340, ఫోన్: 9676060418 రూ.500

రశీదు నం.472
పూజ్యశ్రీ ఆదినారాయణ స్వాములవారు, శ్రీ శివానంద ధర్మక్షేత్రం,
Po. లైదాం, మండలం: పొందూరు, శ్రీకాకులం జిల్లా. 532168 రూ.600

రశీదు నం.473
పూజ్యశ్రీ ఆనంద స్వాములవారు, Po.ముదక్ పల్లి, బాడ్సిరోడు,
జిల్లా:- నిజామాబాద్. ఫోన్: 9704225016 రూ.600

రశీదు నం.474
పూజ్యశ్రీ సుధీరానంద సరస్వతి స్వాములవారు.
శ్రీ అమ్మాయమ్మగారి మఠము, శంకరాపురం, కడప
పోన్- 630570 5042. రూ.600

రశీదు నం.475
పూజ్యశ్రీ రామకృష్ణానందగిరి స్వాములవారు
శ్రీ శంకరానందాశ్రమము,Po ఆళ్ళగడ్డ, జిల్లా:- నంద్యాల
ఫోన్: 7680863194 రూ. 600

రశీదు నం.606
పూజ్యశ్రీ తపస్వి అజయ్ చైతన్య వారు,
మహర్షి మలయాళస్వామి ఆశ్రమము, ప్లాటు నం.48,
కళావతీనగర్, M.I.D.C. సోలాపూర్, 413006
ఫోన్: 7843036 503. రూ.600

రశీదు నం.608

పూజ్యశ్రీ వేముల రామమూర్తి శర్మగారు,
గోదాసుతిన్ గౌదేయన్, Po.సిరిసిల్ల, మం. సిరిసిల్ల
జిల్లా:- రాజన్న సిరిసిల్లా. 505301. రూ.600

రశీదు నం.476
పూజ్యశ్రీ ఆదిరామానంద స్వాములవారు, C/o G. శ్రీనివాస్ రెడ్డి,
1-1 దోదేపాలెం, పిట్టునవారిపాలెం, చందోల్,
బాపట్ల - 522 311, ఫోన్: 7780530950 రూ.600

రశీదు నం.477
పూజ్యశ్రీ రాజు స్వామి, S/o భరత్ కుమార్,
D.No. 10-25, జ్యోతినగర్,Po. తుని, కాకినాడ.
533 401;సెల్. 6281078211 రూ.600

రశీదు నం.478
పూజ్యశ్రీ రామానంద స్వాములవారు, D.No. 16-265 ( న్యూ)
ఓల్డ్. D.No- 8-378, రామనాథంగారి వీధి, భార్గవపేట,
మంగళగిరి, గుంటూరు జిల్లా 522503, సెల్. 964 2013659. రూ.600

రశీదు నం.479
పూజ్యశ్రీ బ్రహ్మచారిణి కృష్ణవేణి గారు, అమ్మాయమ్మగారి మఠము,
శంకరాపురం, కడప- 516002, ఫోన్: 9701542692 రూ.600

రశీదు నం.481
పూజ్యశ్రీ నందా భారతి స్వాములవారు, మంగటివీధి,
సిరిపురం Post, సంతకవిటి, విజయనగరం జిల్లా - 532163
ఫోన్: 9491158732 రూ.600

రశీదు నం.397
పూజ్యశ్రీ వెంకటదత్తానంద స్వాములవారు, దుర్గాదేవి పీఠం,
B.సింగవరం-గ్రామం, అప్పలరాజపురం-పోస్టు,
చీడికాడ-మండలం, అనకాపల్లి-జిల్లా.Pin: 531 028
Cell: 7286045147. రూ.500

## అఖిల ఆంధ్ర సాధు పరిషత్ పోషక సభ్యులు

రశీదు నం.467
వెంకట చరణ స్వామి, Po. పోతుల మడుగు గ్రామం (ముత్యాలంపల్లి)
మండలం: భూత్పూర్, పాలమూర్ జిల్లా, 500
పాలమూరు జిల్లా. ఫోన్: 9849474320. రూ.500

రశీదు నం.468
గీతా మందిరం అధ్యక్షులు, శ్రీ గీతా సత్సంగ సేవాశ్రమం,
పోస్టు, మండలం: చీపురుపల్లి, విజయనగరం జిల్లా-535128,
సెల్. 9440105279. రూ.2000

రశీదు నం.470
గోకరకొండ వేళేశ్వరరావు వెంకటలక్ష్మి, Po. నల్లమిల్లి,
మండలం: అమలాపురం, కోనసీమ జిల్లా.
సెల్. 8886030333 రూ.1500

రశీదు నం.480
ఆధ్యాత్మిక భక్త సమాజము (యతి కుటీరము),
C/o మార్కండేశ్వర స్వామి దేవాలయం, Po. పోచంపల్లి,
యాదాద్రి, భువనగిరి జిల్లా 508284, సెల్. 9951439448 రూ.1120

రశీదు నం.485

T. పద్మగారు, సింగర్ కొండ, Po. కందకూరు రోడ్డు,

R.అండ్ B బంగ్లా ప్రక్కన, సక్కుబాయి కాలని,

ఒంగోలు. సెల్. 9948054624. రూ.1100

రశీదు నం.490

K. సంతోష్ రెడ్డి, Po. చింతకుంట పాలెం, మండలం: పర్చూరు,

బాపట్ల జిల్లా 523167, సెల్- 8897983546 రూ.1100

రశీదు నం.492

శ్రీ నారపు రెడ్డి జగన్నాథరావుగారు, వీరభద్రపేట-గ్రామం,

లక్కవరపుకోట-మండలం, విజయనగరం జిల్లా-535250,

సెల్. 9948 230481. రూ.1100

రశీదు నం.493

రమణ జ్యోతి గారు, C/o జ్యోతిశ్రీ మెడికల్, I పంగిడి Po.;

మండలం: కొవ్వూరు, తూర్పుగోదావరి జిల్లా-534342,

సెల్. 9866968234. రూ.1000

రశీదు నం.607

శ్రీలకావత్ మోతీలాల్ రాజమణిగార్లు, Po. మండలం: సిరిసిల్లా,

By నగర్, H.No-10-7-72

జిల్లా రాజన్న సిరిసిల్లా -505301, సెల్- 9440429397. రూ.1000

## సభా భవన మండప నిర్మాణం కొఱకు విరాళములు

1. రశీదు నం.471. శ్రీ జయదేవ్ గారు, అమ్మాయమ్మ మఠం,
   శంకరాపురం, కడప, సెల్. 7680863194 రూ.10,000
2. రశీదు నం.482. శ్రీ సాంబ శివానంద స్వామి రూ.1120

| | |
|---|---|
| 3. రశీదు నం.483. ఆదిశేషమ్మగారు, సింగరకొండ | రూ.1101 |
| 4. రశీదు నం.484. శీలానందమాతాజీ పారుపల్లి, నిర్మల్ జిల్లా, సెల్. 9391815657 | రూ.1120 |
| 5. రశీదు నం.486. సత్యజ్ఞానానంద స్వామి | రూ.1116 |
| 6. రశీదు నం.487. శ్రీ లిబాద్రిగారు, రాంపూర్ | రూ.1100 |
| 7. రశీదు నం.488. దోమల ప్రభాకర్, సిరిసిల్లా | రూ.1100 |
| 8. రశీదు నం.489. శ్రీగీతా ప్రచారానందస్వామి వాగ్దానం | రూ.5000 |
| 9. రశీదు నం.491. శ్రీరామ కృష్ణానందగిరి స్వాముల వారు, తిమ్మాపురం, భువనగిరి-మండలం | రూ.1120 |
| 10. రశీదు నం.494. శ్రీనిర్మలానందగిరి స్వాములవారు | రూ.3000 |
| గత సంవత్సరము కూడ ఇచ్చారు. రశీదు నం.404 | రూ.2000 |
| 11. రశీదు నం.501. శ్రీ K.చిన్నరామిరెడ్డిగారు, C/o K.వీరారెడ్డిగారు, లక్ష్మీ రెసిడెన్సీ, G 1, 2nd Lane, పటేల్ నగర్, బాపట్ల. 522 101, Cell.93901 16321. (అక్షరాల-ఒక లక్ష రూపాయిలు) | రూ.1,00,000 |
| 12. రశీదు నం.413. శ్రీ ఏడూరుఝాన్సీరాణి, గోపాలరావు గార్ల దంపతులు, జలపవారిగూడెం, వయాకామవరపుకోట, ఏలూరు జిల్లా. 534 449. | రూ.11,000 |



రైలు ఇంజనుకు అమర్చబడియుండు సర్చిలైటు దూరపు వస్తువులను ప్రకాశింపజేయునే గాని దాని వెనుక భాగమున నున్న సమీప వస్తువులను ప్రకాశింపజేయ జాలదు. అట్లే, ప్రపంచ బుద్ధి కలవాడెంత పండితుడైనను దృశ్యమును తెలిసికొన గలడేగాని దృక్కగు ఆత్మను దర్శింప జాలడు. (శ్రీ మలయాళస్వాములవారు)



అఖిలాంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు శ్రీ పరావిద్యానందగిరి మాతాజీ



శోభాయాత్రలో పూజ్య మాతాజీలు







సభలో ఉపన్యసిస్తున్న మహాత్ములు



సభా స్థలములో భక్త బృందము



పూర్ణాహుతి




సభా స్థలము - పద్మశాలి మఠము - పంఢరీపురము


అఖిల ఆంధ్రసాధు పరిషత్తు భవనం
వెల్లంకి వారి వీధి - నాజరు పేట - తెనాలి.